# జంతువులు నడిపే
# వింత సర్కస్



మలయాళ మూలం: 'మాలి'

అనువాదం: టి. వి. రంగాచార్యులు

బొమ్మలు: ఉమాపతి



పబ్లిషర్స్:

దక్షిణ భాషా పుస్తక సంస్థ

మద్రాసు-34.

# JANTUVULU NADIPE VINTA SA

TELUGU TRANSLATION

OF

# CIRCUS

BY

'MALI'

TRANSLATED BY

T. V. RANGACHARLU

ILLUSTRATED BY

'UMAPATHY'

*First Edition* : December 1962

Price Rs 1·60

Weldun Press, Madras-21.

**Second Series—Telugu Ch. Bk. 6**

*Publishers* :

SOUTHERN LANGUAGES BOOK TR

**25, STERLING ROAD : : MADRAS -**

## తొలి పలుకు

ప్రాంతీయ భాషలన్నిటిలోనూ ఒక భాషలోని ఉత్తమ రచనలను ఇతర భాషలలోనికి తర్జుమా చేయించుటకూ, దక్షిణ భాషలు నాల్గింటిలోనూ మంచి పుస్తకములను చౌకగా ప్రచురింపించుటకూ సంకల్పించి, దక్షిణ భాషా పుస్తక సంస్థ కావించుచున్న ప్రశంసనీయమైన కృషికి నేనా సంస్థను అభినందించుచున్నాను. మన భాషలలో చౌకధరకు దొరకు మంచి పుస్తకములకు ఎంతేని అవసరమున్నది. ఈ అవసరమును ఈ పుస్తక సంస్థ తీర్చగలదని నా నమ్మకము. ఈ సంస్థ తలపెట్టిన కార్యకలాపము ఫలప్రదముగా కొనసాగవలెనని నేను ఆశించుచున్నాను.

హైదరాబాదు,
26-9-1960

డి. సంజీవయ్య
ముఖ్యమంత్రి,
ఆంధ్ర ప్రదేశ ప్రభుత్వము.

దక్షిణ భాషా పుస్తక సంస్థ సహకారమున ప్రకటించు
పిల్లల పుస్తకములకు

శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ఉపాధ్యక్షులు
శ్రీ ఎస్. గోవిందరాజులు,
ఎమ్.ఏ., ఎల్.ఎల్.బి., బార్-ఎట్-లా.

# తొలి పలుకు

ఇవి చిన్న బిడ్డల పుస్తకములు. బిడ్డలు వినోదము కోరుదురు. పెద్దలకు తెలిసిన విషయము లెల్ల పిల్లలకు కూడ తెలియవలెను. బిడ్డలా విషయములను క్రమక్రమముగ నేర్చవలెను. ఈ రెండు విధములుగ పుస్తకము లుపయోగపడును. మంచి పుస్తకముల వలన బిడ్డలకు జ్ఞానము, వినోదము కూడ లభించును.

దక్షిణ భాషా పుస్తక సంస్థ సహకారముతో ఈ పుస్తకములను ప్రచురించుచున్నారు. తమిళము, తెలుగు, మలయాళము, కన్నడ భాషలలో ఈ విధముగ సరసమైన ధరలకు, మంచి పుస్తకములను ప్రకటించుటకు దక్షిణ భాషా పుస్తకసంస్థ తోడ్పడుచున్నది. అమెరికాలో ఫోర్డ్ అను దాత యేర్పర చిన గొప్ప ధర్మ సంస్థ ఇందులకు ధన సాహాయ్యము చేయుచున్నది. ఫో మహాశయుడు మోటారుకారులు తయారుచేయు వ్యాపారములోను, ఇ పారములలోను విశేషముగ ధనమార్జించి, మహైశ్వర్యవంతుడై, ఐశ్వర్యమున కొంత భాగము ధర్మకార్యముల నిమిత్త మిచ్చివేసెను. మన్ని దేశముల వారికి ఉపయోగపడవలెనని ఆయన సంకల్పము. ఏ మా దేశ మీ మత మా మతమను భేదము లేకుండ ఈ విధముగ మ లందరకు సాహాయ్యము చేయవలచుట యెంత గొప్ప విషయము!

ఎస్. గోవిందరాజులు
అధ్యక్షుడు,
దక్షిణ భాషా పుస్తక సం

ముఖంలో వీరరసం ఉట్టిపడుతూ ఉంటుంది. అతగాడికి బారెడు తోక. ఆ తోక కొసను చిక్కని వెంట్రుకల కుచ్చు.

సర్కస్ యజమాని గోవిందరావు చేసిన నామకరణం ప్రకారం గుంటనక్క పేరు జంబుకరాయడు. అదే నలుగురినోట పడిపడి చివరకు గిడసబారి 'జంబూ' అయిపోయింది. కోల ముఖం. తళతళలాడే కళ్ళు. అప్పుడప్పుడు అతగాడి ముఖంలో చిరునవ్వు చిందులాడుతూ ఉంటుంది. అప్పుడుగనక చూస్తే ఆముఖం ఏదో అవలక్షణంగా ఉన్నట్టనిపిస్తుంది.

కోతులు రెండూ తోబుట్టువులు. అవి నర-వానరజాతికి చెందిన బాపతు. ఈజాతికోతులు అచ్చంగా మనుషులవలె ఉంటాయి. పెద్దవానిపేరు తిమ్మన్న. చిన్నవానిపేరు చిక్కతిమ్మన్న. ర్కసు చూడవచ్చిన వారిలో కొందరు వీటిని చూచి, "ఇవికోతుల నేకావు; కచ్చితంగా మనుషులే," అనుకొంటూ ఉంటార కాదుకాదు. వీళ్లు మనుషులు కానేకారు. మనుషులుగా మన ంయికాని ఇవి సయాంసా కోతులే;" అంటారు మరికొంద

గొడ్లు రెండూ ఇంచక్కని పైల్వాన్లు. ము టాడు. అందువల్ల అతన్ని అందరూ

ఇంకొకడేమో ఎరుపువాట్లంగా '

మ్య' అంటారు.

నిడుపైన పండ్లు. 'ప

ఇ క

ాడిదా' అని పిలిస్తే దానికి ఘోరమైన అవమానం కాదూ ? ఇంకేలా
నా పిలనివ్వండి, ఫరవా లేదు. 'గాడిదా' అని పిలిపించుకోవడం
ఏమాత్రమూ సహించదు. అయితేనేం, చిక్కతిమ్మన్న ఎవరిని, ఎంత
ేళన చేసినా 'ఏమయ్యోవ్!' అనడానికి ఎవరికీ దమ్ములుండవు.
న్ని అణా కానికి తాతలు దిగిరావాలి. అతడొక కొంటె
ంగి.

గోవిందరావు సర్కసులో ఉన్నదల్లా ఈ మృగాలు మాత్రమే
ుకొంటారేమో! లేదు లేదు. మనుషులుకూడ ఉన్నారు. బలే
ీ బారుఆటలు, అంతరాళంలో ఉరుకులూ పరుగులతో చిత్ర
చిత్రమైన ఊయాల ఆటలు, సైకిళ్లపై జలదరింపజేసే స్వారులు,
్తలవిసుర్లు, పిల్లిమొగ్గలు మొదలైనవి మహాచలాకీగా చేసి
యనిపించుకొనే మగరాయళ్లూ అందులో ఉన్నారు. అయితే
ిందరావు మాస్టరుకు మటుకు మృగాలపైనే మహా
బ్బాయిల్లారా, అమ్మాయిల్లారా అనే ఆయన వాటిని పిలుస్తా
టారు. వాటికి సర్కసు విద్దెలు నేర్పింది సయానా ఆయనే. ఆయన
్యలు నేర్పే పద్ధతే అదొక కొత్తపద్ధతి. కొందరు కొందరు నానాచిత్ర



హింసలుపెట్టి ఆవిద్దెలు వాటికి మప్పుతూ ఉంటారు. పాపం, ప్రాణా
లకు భయపడి అవి వాళ్ల ఆజ్ఞలను పాలిస్తూ ఉంటాయి. గోవింద
రావు మాస్టారుమాత్రం అట్లాంటాయన కాదు. "ప్రేమతో బోధించే
బోధనే బోధన," అని ఆయన వాదం.

మును పొకసారి ఆయనకు గభాలున కోపంవచ్చింది. సింగ
న్నను ఛెళీమని ఒక్క దెబ్బ కొట్టారు. ఆదెబ్బకు సింగన్న తొడ
నుంచి రక్తం ఏకధారగా కారజొచ్చింది. అదిచూచి గోవిందరావు
మనస్సు కరిగిపోయింది. చేసిందానికి చాలా చింతపడ్డారు. వలవల
యేడ్చారు. అది లగాయతు ఆయన ఏమృగంమీదా చేయిచేసు
కొన్న పాపానపోలేదు. మృగాలన్నీ ఆయన్ను తండ్రివలె ప్రేమిస్తూ
వచ్చాయి; దేవునివలె పూజిస్తూవచ్చాయి.

సర్కసులోని మగవాళ్లుకూడ సరిగ్గా అంతే. గోవిందరావు
మాస్టారును గొప్పగా గౌరవిస్తూవచ్చారు. కాని, రానురాను వాళ్ల
గుణం మారనారంభించింది. దీనికల్లా కారణభూతుడు సర్కసు
కంపెనీ మేనేజరు కాళప్ప. అతగాడు గోవిందరావు మాస్టారుకి
దగ్గరిచుట్టం. చిన్నప్పుడే తల్లినీ తండ్రినీ పోగొట్టుకొన్నాడు. గోవింద
రావు మాస్టారే అతణ్ణి చేరదీసి పెంచి పెద్దచేశాడు. తన కంపెనీ
లో మొదట ఒక చిన్న నౌకరీ ఇచ్చాడు. కాళప్ప
మెట్టుమెట్టుగా పైకి ఎక్కుతూ వచ్చాడు. చివరకు
అందుకొన్నాడు. మేనేజరు దయగనక
పెరుగుతాయి. సర్కసులోని పనివాళ్లు ఈ

కంపెనీకి, దేవుడు మేలుచేసి, కాళప్పే
అంత బాగుండిపోను!" అంటూ బారువిద్దెలు
చేసే సాంబయ్యతో ఒకనాడు అన్నా
య్యా ఉయ్యాలాటలు ఆడే ఓబ
య్య మనసు ఉండబట్టలేక మాయ

ల్లంతదూరంలో ఒకచోట వాటిని కొన్నాడు. వాటిని చూసుకోవ వానికి ఒక మనిషినికూడ ఏర్పాటుచేశాడు.

సర్కసుకంపెనీకి—అంటే గోవిందరావు మేష్టారుకు అప్పులు పెరిగిపోయాయి. వాటిని తీర్చేందుకు మరి దారిలేదు. కంపెనీ కూలి పోక తప్పదని ఖాయమయిపోయింది. గోవిందరావు బలే బాధ పడ్డారు. ఆ చింతతో అలమటించిపోయారు. పోయారంటే పోరూ మరి! ఎంతో ఉబలాటంతో, ఆరంభించి ఎన్నెన్నో యాతనలుపడి చేతులారా పైకి తెచ్చిన సర్కసు—వేలారుమందికి వినోదంకలిగిస్తూ ఆనందింపజేస్తూ వచ్చిన సర్కసు ఇదుగో నేడో రేపో తన కండ్ల యెదటే కూలిపోవడానికి సిద్ధంగా ఉన్నదంటే ఎవరుమాత్రం అలమ టించకుండా ఉండగలరు!

అయినా, మనుషుల గుణాలు నిమిషాల్లో ఎంతఇదిగా మ పోతాయ్! అదివరకు గోవిందరావు మేష్టారుమీద ఉంటూవచ్చి భయమో, భక్తో, గౌరవమో కాళప్పకిప్పుడు [illegible] లేకుండాపోయింది. ఒకనాడు కాళప్ప గోవిందరావుదగ్గర[illegible] వెళ్ళి, భయమూ భక్తీ లేకుండా ధైర్యంగా ఆయనయెదుట కాలు మీద కాలువేసుకొని కూర్చున్నాడు. అదివర కెన్నడూ అతడలా చేసిందిలేదు. ఇదే మొట్టమొదటిసారి. గోవిం[illegible]రావు చాలా [illegible] న్నారు. [illegible]నా, ఆయన [illegible]

యిస్తాను. ఏమంటావ్ మరి? చెప్పుత్వరగా. నా యోచనకు ఒప్పు కొంటావా, ఒప్పుకోవా? ఏదో గట్టిగా తేల్చు. ఒప్పుకోకపోయావా ఇక ఈకంపెనీకి పంగనామాలేనని తెలుసుకో!'' అని నిజంగా నామాలు పెట్టేటట్లు తన మూడువేళ్ళు మొగాన పెట్టుకొని అభి యించి చూపాడు.

గోవిందరావు తలవంచుకొని దీర్ఘంగా ఆలోచించారు "కంపెనీ అసలు కూలిపోకుండా ఉండవలెనంటే ఒకే ఒక మార్గం కనబడుతున్నది. కంపెనీకి కాళప్పను యజమానిగాచేయడం ఒక్కటే ఆ మార్గం. ఐతే అప్పుడు నా అల్లారుముద్దు మృగాలు ఏమవు తాయి? అమ్మయ్యో! వాటినేమైనాసరే విడిచిపెట్టకూడదు,' అను న్నారు. మృగాలతో ఎడబాటుమాట అనుకోవడానికే ఆయన ల్లాడిపోయారు. చివరకొక నిశ్చయానికి వచ్చారు. తలయెత్తి ప్పతట్టు చూచారు. "కాళప్పా! అలాగే కానీ. నీవు చెప్పినట్లే నులే. నీవు కోరినట్లు కంపెనీని నీకు ఇచ్చివేస్తాను. అయితే ఒక ట. నామృగాలనుమటుకు నీకు ఇవ్వను. సరేనా? ఇది సమ్మతమేనా?'' అని అడిగారు.

మృగాలు లేనిదే ఇక సర్కసేమిటి? కాళప్పకు మృగాలు [illegible]. అయినా, "కంపెనీని మొదట చేజిక్కించు [illegible] [illegible]నేందుకు

గోవిందరావు తమ పెంపుడు మృగాలను వెంటబెట్టుకొని, తమ మూటా ముల్లెలతో బయలుదేరారు. పోయిపోయి కణ్వారు కోని తమయిల్లు చేరుకొన్నారు.

మంచి అర్ధరాత్రి. గోవిందరావుకు నిద్రపట్టలేదు. మృగాలు కూడ కండ్లు మూయలేదు. ఇంటిలో గోవిందరావు ఏడుస్తూవుండడం మృగాలకు వినిపించింది. అలాగే బయట మృగాలు ఏడుస్తూవుండడం గోవిందరావుగూడ విన్నారు. ఇక లోపల పండుకొనిఉండలే పోయారు. వెంటనే బయటికి లేచివచ్చారు. ఆ నమ్మినబంట్లత నోరువిడిచి మాట్లాడారు.

ఆయన వాటితో అనేకవిషయాలు మాట్లాడారు. ' యేమో పోయింది. పోతే పోనీలెండి. ఇంకమనం ఒక కొ ఆరంభించాలి. మీకు నేను కొన్ని కొత్త విద్యలు చెప్పిస్త వరకూ ఏమృగమూ ఎన్నడూ చేసి చూసి యుండని కొ విద్యలు మీరు నేర్చుకోండి. వాటిని చూచి ప్రపంచమంతా ఆశ్చర్యపడిపోవాలి చూచుకోండి. "ప్రపంచంలో మహా గాస్టారు ఎవరు? ప్రపంచంలో మహా నేర్పుగల సర్కసుమృగా వి?" అని అడిగితే ఒకే ఒక జవాబుమాత్రమే ఉండాలి. ప్రశ్నకు అందరూ ఒక్కటేగొంతుతో 'గోవిందరావు మాస్టారూ, ద్యలు నేర్చుకొన్న మృగాలూ,' అని ఠకీమని జవాబు తెలిసిందా?" అని ఎంతో ఉత్సాహంతో బుజ్జగించి సాహం కలిగించారు.

ని, మన మనుకొన్నట్లే అన్నీ జరుగుతాయా? తానొకటి వమొకటి తలిచాడన్నట్లే అయింది అక్షరాలా. ఉన్న విందరావు మాస్టారుకు జ్వరం తగిలింది. అది క్రమేణా కిందికి మారింది. కొంపతీసి ఆయన బుడుంగుమంటూరా

పాపం, ఆమృగాల కన్నిటికీ ఆయనే ఏడుగడ. స్మృతి తెలిసింది మొదలు అవి ఆయనవద్దనే పెరిగాయి. వాటిని ఇన్నాళ్లూ ఆయనే కన్నబిడ్డలవలె కాపాడుతూవచ్చాడు. కడుపునిండా తిండి పెట్టి పెంచి పోషించాడు. అంతేనా? చక్కని చదువులుచెప్పి బుద్ధిమంతులను చేశాడు. అటువంటి చల్లని మహారాజు ఈ మాయదారి జ్వరానికి బలియై మరణిస్తే మరి వాటికి గతియేమిటి?

ఒకవేళ కర్మంచాలక ఆయనకేమైనా అయితే కాళప్ప ఆ మృగాలను తన సర్కసులో చేర్చుకొంటాడేమో! ఊహూం. అతను చేర్చుకొంటానన్నా అవి చస్తే చేరవు. గోవిందరావు మాస్టారును మోసంచేసిన పాపికదూ అతను! ఛీఛీ! ఈయోచన అంతా ఇప్పుడెందుకు? గోవిందరావు మాస్టారుకు జ్వరంతగ్గనీ. అంతే చాలు. ఆయనకు గుణమయ్యానా? ఆయన బతికి బయట పడతాడా? "రామయ్యప్రభూ! మా మారాజు ఒళ్లు వేగిరం బాగుచెయ్యవూ? అంటూ అవి అన్నీ మనసారా దేవుడికి మొక్కుకొన్నాయి."

ఆ మొక్కులేమైనా ఫలించీనా?

చూస్తూండగానే రెండురోజులు గడిచాయి. అప్పటికి తేలియింది—ఇక వాటి మొక్కులేవీ ఫలించవని. రాత్రి సుమారు దిగంటలుంటుందేమో, గోవిందరావు మాస్టారు నీరసించిన ంతుతో మృగాల నన్నిటినీ దగ్గరకు పిలిచాడు. "నా చిన్నారి ంగాళ్లారా! అందరూ ఇలారండి. వచ్చి నాదగ్గరకూర్చోండి. మీ ు చూస్తూ హాయిగా కళ్ళుమూస్తాను," అన్నాడు. మృగా ఆయన మంచంచుట్టూ మూగాయి. గోవిందరావుమాస్టారు న్నిటినీ ఒక్కొక్కటిగా మార్చిమార్చి చూస్తూ కళ్లనిండా కట్టుకొన్నాడు. అదిచూచి మృగాలుకూడ [illegible] పెట్టు యి. తిమ్మన్న ఆయన కణతలమీద [illegible]

[illegible] జంగమన

వాసవలె కాసేపు గోల్లున ఏడ్చారు; కాసేపు పక్కుమని నవ్వారు. ఊష్ణం ఎక్కువయితే కొంతకొంతమందికి ఇలాగే అవుతూఉంటుంది. ఆయన ఏడుస్తూ ఏడుస్తూనే, "నా చిట్టినాయనా, నా నవ్వులరాజా, నా బంగారుపాపా, ఏదీ పచ్చలు పొడిపించిన నీకుడిచెయ్యి చూద్దాం రా. దా, దా, నాదగ్గరికి రా...సాక్షాత్తూ ఆ హనుమాన్ల స్వరూపం. నాయనా, ఈ స్వరూపం మారదు. ఆ హనుమంతుడు సదా నిన్ను కాపాడతాడు. సదా నీకు అండగా ఉంటాడు. అందుకేకదూ నేను పనికట్టుకొని నీచేతిలో ఆపచ్చ పొడిపించింది? రా, రా, ఇలావచ్చి నాఒళ్లో కూర్చో...నా నాన్నా! నా నాన్నా!" అని వాపోయాడు.

'నాన్నా, నాన్నా,' అనే ఆపిలుపులో ఆయనలోని అలవి లేని అనురాగం అల్లే ఉట్టిపడింది. చుట్టూమూగిన మృగాలన్నీ ఇట్టిట్టే ఆ బంగారుపాపను జ్ఞాపకానికి తెచ్చుకొన్నాయి. ఆ పాపిష్ఠి దినాన్ని తలచుకొని తలచుకొని కంటికీ మంటికీ ఏకధారగా కన్నీళ్ళు కార్చాయి.

ఆ పాపిష్ఠిరోజునాటికి గోవిందరావుమేష్టారు అబ్బాయికి వ సారం రెండున్నరసంవత్సరాల వయస్సు. తల్లిలేని పిల్లవాడు. అందమే అందం! ఎప్పుడు చూచినా చిరునవ్వులుగుప్పే ఆ పాప యిని చూస్తే ఎట్టివారి మనస్సులకూ హాయిహాయి మనిపించేద నవ్వులరాజా, బంగరుపాప అనేవే అలనాడు ఆపాపాయిక్కి పిలుస్తూ వచ్చిన ముద్దుపేర్లు.

ఆ పాపిష్ఠిరోజునాడు—అర్ధరాత్రి సర్కసు. రెండపి ఆడుతూ [illegible] సమయం. సర్కసుడేరాకు వెనుకవైపున [illegible] హాయిగా నిద్రపోతున్నా [illegible]

[illegible]

నౌకరిని కావలిపెట్టేవాడు. ఆ రోజు సింగయ్యవంతు. సింగయ్యా, నిద్ర ఎక్కడ ముంచుకు వస్తుందోనని, ఒళ్ళు దగ్గర పెట్టుకొని పరాకు



డా పహరా కూర్చున్నాడు. ఒకవేళప్పుడు ఉన్నట్టుండి ఎవరో. త్తుగా దగ్గరకు వస్తున్నట్లు సింగయ్యకు చూచాయగా తోచింది. ణంలో అతనితల గిఱ్ఱున తిరిగినట్లయింది. ట్టివేసినట్లు కదల డ వీలుకాలేదు. కంటికి ఎట్లెట్లో, ఏమేమో నిపించింది. చిదేకాని ఇదీ అని స్పష్టంగా తెలిసేటట్లు కని కూ ఏమిటది? మనిషా, మాయదారి నీడనా? నా ఇటూ తిరుగుతూన్నట్లు? తర్వాత ఏమయిం నే తెలీదు.

తెలివి వచ్చినతర్వాత పరిస్థితి ఏమిటి?

"బంగారు పాపాయి కనబడలేదు, బంగారు పాపాయి కన బడలేదు!" అని పెద్దగోల బయలుదేరింది. కొందరు కాలుగాలిన పిల్లిలా అటూఇటూ తిరుగుతున్నారు. కొందరు ఏమిచేయడానికీ పాలుపోక స్తంభాల్లా నిలుచుండిపోయారు. గోవిందరావు మాస్టారు గోలుగోలుమంటూనే కుప్పకూలి పడిపోయి దొర్లిదొర్లి ఏడు స్తున్నారు. "నా నవ్వులరాజా, నా బంగరు పాపా" అంటూ దిక్కు లదిరిపోయేటట్లు కేకలు పెడుతున్నారు. ఆ కేకలకు రాళ్ళు గూడ కరిగిపోతాయేమో ననిపించింది.

ఎవడోగాని మందు మూచూపి సింగయ్యను మంచిమత్తులో పడేసి బంగరుపాపను కాస్తా అమాంతంగా ఎత్తుకుపోయాడు. ఎవ డది? ఎందుకని ఎత్తుకుపోయినట్లు? ఎవరికీ బోధపడని పరమ రహస్యం. ఆరు, ఏడు ఏండ్లుగూడ గడచిపోయాయి. అయితేనేమి? ఆ చిదంబర రహస్యం చిదంబర రహస్యంగానే ఉండిపోయింది.

"నా చిట్టి నాయనా! నా చిట్టి నాయనా"—అంటూ ఇదిగో ఇప్పుడుకూడా గోవిందరావు మాస్టారు ఆ పాపాయిని గురించే ప( పరి విధాలుగా పలవరిస్తున్నాడు.

గోవిందరావు తిరిగి మాట్లాడ నారంభించాడు. అయితే ఇప్పుడు పిచ్చిపిచ్చి మాటలు వాగలేదు. స్మారకంతో సాఫీగా; మాట్లాడాడు. కాని, స్వరమే మహా నీరసంగా ఉండింది. ఎం మాటలు మాత్రం స్పష్టంగానే ఉండినాయి. "నా ముద్దులా యిల్లారా!.. ..ల్ల కాలేదు. నా వల్ల కాలేదు...కొత్తకొ ఏక మీకు నే..ప్పలని...చాలాచాలా ఆశపడ్డాను...నేర్పితీర్నాక ..క చేసుకొని ఉండినాను...వల్లకాలేదు. కొల్లల్పం ..ఓహ్! ప్రపంచానికంతా దిగ్భ్రమ గలిగించే ..ఇంతవరకు ఏ మృగమూ చేసిచూపియుం . నేర్పుదామనుకొన్నాను...సాధ్యంకాలే.. ..మా రాత...నా రాత...పోనీండి...నాయ

ఇలా దగ్గరికి రండి...నాకు...వేళ దగ్గరపడింది...నేను...పోతు న్నాను...పోతున్నాను.''

అంతే. మాటలు నిలిచిపోయాయి. తిమ్మన్న దేహమంతా ఎగాదిగా తాకిచూచాడు. ఇంకెక్కడి గోవిందరావు! ఆయనప్రాణం ఎప్పుడో 'గోవిందా' అన్నది.

అప్పుడు అక్కడ వినిపించిందల్లా ఏమిటి తెలుసునా? 'నా' అనే నాథుడు లేని ఆ మృగాల గోడుగోడు ఆ క్రందనలూ, వినేవారి గుండెలను బ్రద్దలుచేసే ఆర్తనాదాలూ. ఏమిటేమిటని పరామర్శించ డానికి ఎవరూ వచ్చినపాపాన పోలేదు. దగ్గరా ఎవరూ లేరు.

## 2

మూడురోజులు గడిచిపోయాయి. మృగాలు ఏమీ తిననేలేదు. తిండిమాట దేవుడెరుగు. నాలుకలు తడుపుకోవడానికి చ్చి మంచినీళ్లయినా ముట్టలేదు. అన్నీ శోకసాగరంలో మునిగి ర్చున్నాయి. ఒక్కగానొక్క మనిషి తమను పెంచి పెద్దచేశాడు. న్నబిడ్డలవలె ఆదరించి కాపాడాడు. ఆయన కాస్తా చనిపోయాడు. ి చేసుకొన్న పుణ్యమంతే అని అనుకొందామంటే, ఇక వాటికి కుకు దెరువేమిటి? వాటి గతియేమిటి? ఏమీ పాలుపోలేదు. త్తనదారు తిమ్మన్నకు ఏమి చెప్పడానికీ నోరు రాలేదు. అన్నీ సి తలలు వ్రేలవేసుకొని ఆలోచనలో మునిగి కూర్చున్నాయి.

ఇంతలో ఏదో కాళ్లచప్పుడు వినిపించింది. ఏమిటా అని అవి ఒక్కసారిగా తలలెత్తి చూచాయి. ఆ వచ్చింది ఎవరు లుసా? కాళప్పే! అతనివెంట అదెవడో మరొకడుకూడ ఉన్నాడు.

''ఇదిగో చూడండి. దిక్కులేని మీకు ఏదో ఇంత దిక్కు చూపి సాయంచేద్దామనే మేము పెద్దమనసుచేసి వచ్చాము. మిమ్మ ందరినీ నా సర్కసుకంపెనీలో చేర్చుకొంటాను. మీకు కడుపు

నిండా తిండిపెడతాను. మీరు హాయిగా బతకవచ్చు. ఏమంటారు మరి? మీకు సమ్మతమేనా?'' అంటూ అడిగాడు కాళప్ప.

వాడేమిటి, వీటికి సాయంచేయడ మేమిటి? అదికాదు అంతరార్థం. అసలు విషయ మేమంటే, మృగాలులేని సర్కస్సుకు విలువే లేదు. ఆమాటకు వస్తే అది సర్కస్సేకాదు. ఈ సంగతి కాళప్పకు ఇంచక్కా తెలుసు. ఇవేమో బాగా ఆరితేరిన గొప్ప సర్కసు మృగాలు. ఇవి గనక ఉంటే రాబడి బాగా వస్తుంది. ఇలాంటివి వేరే దొరకడం కష్టం. అంతగా దొరికినా, వాటికి బోలెడు డబ్బు ఖర్చుపెట్టవలసి ఉంటుంది. అప్పుడైతే గోవిందరావు తన మృగాలను ఇవ్వనంటే ఇవ్వనన్నాడు. ఇప్పుడతడు చచ్చిపోయాడుగా! ఆ ఇబ్బందీ తీరిబోయింది. ఇక నిప్పుడు ఏదోవిధంగా వీటిని మభ్యపుచ్చి తీసుకుపోవాలి. ఇందుకే కాళప్ప ఇప్పుడు పనికట్టుకొని వచ్చాడు.

''ఏమిటి మరి, మీకు సమ్మతమేనా?'' అని మళ్లీ ప్రశ్నించాడు.

''ఊఁహూఁ. మా కిష్టంలేదు. మేము రాము,'' కచ్చితంగా చెప్పివేశాడు తిమ్మన్న.

''అవునవును. అందుకు మేము సుతరామూ ఒప్పుకో'' మ తక్కిన మృగాలుకూడ తిమ్మన్న జవాబును బలపరిచాయి.

''విషయం తెలుసుకోకుండా, లోతుగా ఆలోచించకుండ మాట్లాడకండి. ఇప్పుడు మీకు తిండిపెట్టి కాపాడడానికి మీ గోవిం రావు లేడు, జ్ఞాపకం పెట్టుకోండి. ఇప్పుడు మిమ్మల్ని కాపాడగ వాడు ఒక్కడే ఉన్నాడు. అతడెవడో తెలుసా? నేనే! నా కం నీలో చేరండి, ఇది మీకు గొప్ప అదృష్టం సుమా! అనుకోకుండ వస్తున్న ఈ అదృష్టాన్ని గుడ్డిగా కాళ్లతన్నివేయకండి. అంతకనే వెఱ్ఱితనం ఉండదని తెలుసుకోండి.''

''చాలించండి మీ ధర్మపన్నాలు. మేము వట్టి వెఱ్ఱి వెం శప్పలమని అనుకొంటే అనుకోండి. మీ కంపెనీలో చేరడానికి మేమ

సుతరామూ సిద్ధంగా లేమని మరిమరీ చెబుతున్నాను. పోయిపోయి మహానుభావుడు గోవిందరావు మాస్టారును గోతకూల్చిన ఆసామి దగ్గరికి పోయి పనిచేయడమా? అది కానిపని. ఎంత ప్రాణం మీదికి వచ్చినా సరే, మేము మీ కంపెనీకి రామంటే రాము,'' అని తిమ్మన్న గట్టిగా చెప్పివేశాడు.

''అయితే, రానేరారా? నిశ్చయంగా నేనా?'' అని కాళప్ప కోపంతో అడిగాడు.

''మాటికీ ముమ్మాటికీ నిశ్చయం. మేము రాము, రాము, రాము. సరేనా?''

ఇది విని కాళప్ప తెల్లబోయాడు. ఈ తిరస్కారానికి ఉగ్రుడై పోయాడు. ''మిమ్మల్ని ఏమిచేస్తానో చూచుకోం''డని ఉరిమాడు.

తర్వాత అతగాడు కూడావచ్చిన ఆసామి వైపు తిరిగి, ''ఏదీ ఆ పత్రం ఇలా తీయండి. ఊఁ, త్వరగా.'' అన్నాడు.

మృగాలచూపు తకీమని ఆ ఆసామి వేపు తిరిగింది. ఆయన పంట్లామూ నల్లకోటూ వేసుకొని బూట్సులు తొడుగుకొని ఉన్నాడు. నల్లకోటుమీద మళ్లీ ఒక నాలుగుచేతుల నిలువుటంగీ వేసుకొన్నాడు. ఆయన ఒక వకీలు!

''వకీలుసార్! ఆ పత్రం బిగ్గరగాచదివి, అందులో
కూలు వీరికి వివరించి చెప్పండి. ఈ మూర్ఖులు సంగతి తెలు

వెంటనే ఆ వకీలు తనజేబులోనుంచి ఒక కాగితం
తీశాడు. మృగాలముందు నిలుచుకొని దానిని విప్పాడు. '
పత్రం గిత్రం ఏమిటో తెలియదుగదూ! నేను చెబుత
విలులు, ఉయిలు అంటారే, ఎప్పుడైనా విన్నారా? అట
ఉయిలు పత్రం ఇది. ఎవరి ఉయిలుపత్రం. గోవిందరావు
గారి ఉయిలుపత్రం. తెలిసిందా? ఈ ఇంటినీ, ఈ స్థల
కాళప్పగారికి వ్రాసియిచ్చారు. ఇక ఇందులో మీక
హక్కూ లేదు. మీకు చట్టం తెలుసునా?

పాపం! సర్కసు మృగాలకు పోయి చట్టం ఎలా తెలుస్తుంది? వారిలో వకీలు ఎవరూ లేరు. కోర్టుకు పోయిన పాపాన కూడ వారు పోయింది లేదు. వకీలు ఒక సకిలింపు సకిలించి గొంతు సవరించుకొన్నాడు. సవరించుకొని, చట్టాన్ని గురించి బారెడు ఉపన్యాసం దంచాడు. అదేమీ మృగాలకు బోధపడలేదు. దాని ముగింపు వాక్యం మాత్రం బోధపడింది. "ఇందువల్ల మీ యావన్మందికీ తెలియజేయడమేమంటే, ఈ ఇంటిలో ఇక మీకు ఏలాటి హక్కూ లేదు. దీనిపై సర్వహక్కులూ ఇక కాళప్పగారివే. ఆయన గనక తలచుకొంటే మిమ్మల్నందరినీ ఉన్నపాళంగా ఇక్కడినుంచి తరిమి వేయవచ్చు. తెలిసిందా?"

"ఇందులో ఏదో మోసం ఉంది. గోవిందరావు మాస్టారు ఎన్నటికీ మమ్మల్నిలా చేయరు. ఇదేం మోసమో? తెలియడం లేదు," అనుకొన్నాయి మృగాలన్నీ.

"కట్టకడసారిగా అడుగుతున్నాను. నా కంపెనీలో చేరతామంటారా, చేరమంటారా? చేరమన్నట్టయితే మిమ్మల్నందరినీ



ఇదిగో ఇప్పుడే ఈయింటినుంచి గెంటివేయిస్తాను,'' అంటూ హుంకరించాడు.

"మేము చేరము. నిశ్చయంగా చేరము.'' అని మృగాలన్నీ ఠకీమని జవాబు చెప్పాయి. సింగయ్య ఒక్క గర్జింపు గర్జించాడు. ఆ గర్జింపుతో కాళప్పా, కాళప్పవకీలూ తారెత్తిపోయి వెనక్కు ఒక్కదూకు దూకారు. సింగయ్యముఖం భయంకరంగా తయారైంది. కోపంతో అతని శరీరం శివమెత్తిపోయింది. అతని నోరు నురగలు గక్కుతున్నది. వెంటనే చిట్టి తమ్మన్న దానిముందుకు ఒక్కదూకున దూకిపడ్డాడు. సింగయ్య గడ్డంపట్టుకొని ఆడించాడు. "సింగడూ, ఏమిపని యిది? గోవిందరావు చెప్పించిన పాఠం అప్పుడే మరిచి పోయావా? ఏదీ, నూరుదాకా లెక్కపెట్టు. ఊఁ, మొదలెట్టు.'' అని అదిలించాడు.

సింగయ్య చిత్తవృత్తిని బాగా ఎరిగినవాడు గోవిందరావు. సింగయ్యకు గనక కోపంవస్తే తంటాయే! తానేం చేస్తున్నాడో కూడ యోచించడు. ఏదైనా అఘాయిత్యం చేసినా చేసేవాడే.



అతని కోపం ఆర్పడానికి అతని కొక నయమైన చిట్కా-
యం చెప్పించారు ఆయన. కోపం ముంచుకొని వచ్చినప్పుడు
కుదురుగా నూరు దాకా లెక్క-పెట్టడమే ఆ ఉపాయం. అయితే అది
ఎల్లప్పుడూ సింగయ్యకు జ్ఞాపకం ఉండి చావదు. పనికట్టుకొని
ఎవరో ఒకరు ఎక్కటికప్పుడు జ్ఞాపకం చేస్తూ ఉండాలి. చిన్నతిమ్మ
న్నకే ఆపని పెట్టారు.

చిన్న తిమ్మన్న జ్ఞాపకంచేసినమీదట సింగయ్య లెక్క-పెట్ట
డం ఆరంభించాడు. "ఒకటి, రెండు, మూడు..." అని పన్రెండు
వరకూ లెక్క-పెట్టాడు. అంతలోకే సింగయ్య కోపమంతా అణగి
పోయింది!

ఈ మధ్యలో కాళప్పా, జంబూ ఇద్దరూ ఒకరినొకరు రహ
స్యంగా చూచుకొన్నారు. చిన్న తిమ్మన్న అది యెలాగో గమనిం
చనే గమనించాడు. ఇందులో ఏదో గూఢు పురానీ ఉందని అతనికి
తోచింది. అయితే అదేదో మాత్రం బోధపడలేదు.

"మేము మీ కంపెనీలో చేరేమాట కల్ల. ఇంక దానిని
గురించి మమ్మల్ని మరేమీ అడగవద్దు," అని తిమ్మన్న తీర్మా
నంగా చెప్పాడు.

"అవును, అంతే, మేము మీకంపెనీలో చేరము, చేరము,"
అని మృగాలన్నీ ఒక్క-మాటగా బదులుచెప్పాయి.

"సరిసరి. చేరకపోతే చేరకపోండి. మాకేమి? మీకు నేను
ఒక నెలరోజులు గడువిస్తున్నాను. ఆ గడువు ముగియంగానే......
వకీలయ్యగారూ, తర్వాతిసంగతి చెప్పివేయండి," అని కేళప్ప
వకీలును పురమాయించాడు.

వకీలు అందుకొన్నాడు. అవకాశం దొరికిందో లేదో ఇంకొక
ఉపన్యాసం దంచాడు. చట్టాన్నిగురించీ, అందులోని సాధకబా
ధకాలను గురించీ, మంచిచెడ్డలను గురించీ వివరంగా చెప్పి, "చ

ప్రకారం మిమ్మల్ని ఇక్కడినుంచి వెళ్లగొడతాం,'' అనే ముఖ్యమైన మాటతో ముగించాడు. తర్వాత చేతిలోని పత్రాన్ని భద్రంగా చుట్టజుట్టి జేబులో పెట్టుకొన్నాడు. ముందు కాళప్పా, వెనుక వకీలూ విసవిస వెళ్లిపోయారు.

పెద్దసంకటం వచ్చిపడింది. పరిస్థితి విషమించింది. మృగాలు ఇది తెలుసుకొన్నాయి. ఇంకొక నెలరోజులు పోతే తమకు నిలువ నీడకూడా ఉండదు. ఏమిటిదారి?'' సోదర సహచరులారా, .ఏది ఏమైనాసరే నేను ఈయిల్లు విడిచి కదలనే కదలను. నన్ను కొట్టినా సరే, చంపినాసరే నేను ఇక్కడినుంచి కాలుకదపను. ఇక్కడ ప్రాణాలు వదులుతాను. తమ్ముడు చిన్నతిమ్మన్నకూడ వెళ్లడు. వెళ్లదలచుకొన్నవాళ్ళు నిరభ్యంతరంగా వెళ్లవచ్చు. ఇన్నాళ్లూ అందరం ఒకటిగా ఉన్నాం. అయినా నేను అడ్డుపడను,'' అంటూ తిమ్మన్న తన తీర్మానం తెలియజేశాడు.

''నేనూ పోను. తిమ్మన్నా, చిన్నతిమ్మన్నా ఎక్కడ ఉంటే నేనూ అక్కడే ఉంటాను,'' అని సింగన్న వెంటనే అందుకొన్నాడు.

గజేంద్రుడూ, పల్లయ్యా, నల్లయ్యా, గుఱ్ఱాలూ, ఒంటెలూ అన్నీకూడ ఆమాటే అన్నాయి. అయితే, చల్లయ్యా, తౌడయ్యా, జంబూ—ఈ ముగ్గురూమాత్రం వెళ్లిపోతామని బయలుదేరారు. జ్ఞానం తెలిసింది మొదలుకొని అందరూ ఒక్కటిగానే ఉన్నారు. అంత కలిసి కట్టుకుటుంబంలో ఉట్టిపాటున ఇప్పుడీ ఎడబాటు వచ్చి పడింది. విధిలేక వారు వీడ్కోలుచెప్పి వెళ్లేటప్పుడు అందరూ కళ్ల నీళ్ళుకార్చారు.

బయటికి నడవనివారందరూ లోపలికివెళ్లి పడుకొన్నారు. కడుపులుకాలి వారలాగే కాలధర్మం చెందేగతి వారి తలలో వ్రాసిందేమో?

మరి మూన్నాళ్ళు గడిచాయి. అప్పుడొక ముచ్చట జరిగింది. అర్ధరాత్రి దాటి ఉంటుంది. ఆకలికి అలమటించి అలమటించి

మృగాలన్నీ గాఢనిద్రలో ఉన్నాయి. తటాలున తిమ్మన్న తుళ్లిపడి లేచాడు; అందరినీ తట్టిలేపాడు; "సోదరులారా, దారి దొరికి పోయింది, దొరికిపోయింది" అన్నాడు.

మంచి నిద్రలో ఉన్న మృగాలన్నీ అదిరిపడిలేచి, ఒళ్ళువిరుచుకొని, తిమ్మన్నవంక మిణకరిస్తూ చూశాయి. అందరి నోళ్లలోనూ 'ఏమిటేమి'టని ఒకప్రశ్న ఒక్కమాటుగా ఊడిపడింది.

"గోవిందరావు మేష్టారు నాకు దర్శనమిచ్చారు. నాతో ాట్లాడారు!" తిమ్మన్న ఎంతో ఆవేశంతో చెప్పడం మొదలు ెట్టాడు.

అంతలోనే అవి అన్నీ ఉండబట్టలేక, "ఏమిటేమిటి? అలాగా? ఆయన ఏమన్నారేమిటి? ఏమిదారి చూపించారేమిటి?" అంటూ ఒక్కటిగా లంకించుకొని, ఆయననోటినుంచి ఏమిజవాబు వస్తుందా అని అలాగే నోళ్ళు తెరుచుకొని చూస్తూ కూర్చున్నాయి.

"గోవిందరావుమేష్టారు మనకు కొన్ని అద్భుతమైన విద్యలు నేర్పుదామని ఆశపడ్డారుగదూ! వాటిని నామూలంగా నేర్పించ నున్నట్లు ఆయన నాతో చెప్పారు. ఎవరైనా ఒకరు మరణిస్తే ఆతర్వాత నెలరోజులకు పిమ్మటే ఆత్మ పరలోకానికి వెళ్ళుతుందట. గోవిందరావుమేష్టారు ఆత్మ అంతవరకూ మనతోనే ఉంటుందట. నా దేహంలో దూరి నా మూలంగా పాఠాలు నేర్పబోతుందట," అని తిమ్మన ఒకే గుక్కతో జవాబుచెప్పాడు.

మృగాలకు ఆత్రంపుట్టింది. ఆ విద్యలేమిటో ఇప్పుడిప్పుడే తెలుసుకోవాలని ఉబలాట పడ్డాయి. ఆ ఉబలాటం చూచి తిమ్మన్న వాటిని ఒక్కొక్కటిగా వివరించాడు. వారందరూ ఆశ్చర్య పడ్డారు. ఏమిటిది? ఈవిద్యలను ఎలా చూపడం? సాధ్యమయ్యే పనేనా ఇది?

“సాధ్యంకాకపోవడమేమిటి?” అన్నాడు తిమ్మన్న.

“ఏమిటి, సాధ్యమవుతుందా?” మృగాల సందేహం తీరలేదు.

“తప్పకుండా సాధ్యమవుతుంది.” అని తిమ్మన్న కచ్చితంగా చెప్పాడు.

ఆ తెల్లవారుజామునే పాఠాల అభ్యాసం ఆరంభించారు. దేహకష్టాన్నికూడ లక్ష్యపెట్టకుండా, విశ్రాంతికూడా లేకుండా తిమ్మన్నవారికి ఆ విద్యలన్నీ నేర్పాడు. ముందు చూపుతూవచ్చిన విద్యలన్నీ పట్టి పిల్లవిద్యలని వాటికి వాటికే అప్పుడు బాగా బోధపడింది.

ఇలా నాలుగైదురోజులు గడిచాయి. ఒకనాడు పాఠం జోరుగా జరుగుతూవుంది. తిమ్మన యథాలాపంగా ముందుకు చూశాడు. అల్లంతదూరంలో చల్లయ్యా, తౌడయ్యా, జం... తమవేపే వస్తూవుండడం కనబడింది. “ఇదేమిటిది? సెలవుని... వెళ్లిపోయినవారు తిరిగి వస్తున్నారే! ఎందుకు వస్తున్నట్లో” అనుకొన్నాడు తిమ్మన్న.

ఇంతలోనే వారూ దగ్గరకు వచ్చారు. అందరిదృష్టి వారిమీంద పడింది. చల్లయ్య ముందుకు వచ్చి, వెనుకకాళ్ల వేళ్లతో నేల గీరుకొంటూ, “తోడిజాతివారితో చేరిపోదామని ఎంతోఆశతో అడవికి వెళ్లాను. కాని, నాజాతివారు ససేమిరా నన్ను చేర్చుకోమన్నారు. చేర్చుకోకపోతే పోయారు. అంతతోపోయినా బాగుండేది. అందరూ చేరి నాముఖాన కారి ఉమిశారు,” అని అలోమని అంగలార్చాడు.

“ఎందుకని?” అని అడిగాడు గజేంద్రుడు.

“చెప్పుకొంటే సిగ్గులచేటు! ‘ఒరేయ్ సీతప్పా, నీవొక క్లాస్ పులివి కదూ! కుక్కమాదిరి మనుషులకు గులాంపనిచేసి పడునమ్మా అని ఇప్పుడిక్కడికి వచ్చావా? అభిమానశాలులైన తవి పులులమధ్య నీకు స్థానంలేదు. పో, బయటికి పో!’ అని

అందరూ నామీదికి లంకించుకొన్నారు. కాలికి బుద్ధిచెప్పి పరుగెత్తి రావడంకన్నా గత్యంతరం నాకేమీ కనబడలేదు. కాదుగూడదని అక్కడే ఉండి ఉంటే అందరూ కలిసి నన్ను నిలువునా చీల్చి చంపేసి ఉండేవారే!''

''ఇంచుమించు నాకూ అదే అనుభవమయింది,'' అంటూ ఎలుగుతొండయ్య చెప్పరాని సిగ్గుతో తలవంచుకొని నిలుచుండి పోయాడు.

''నా మనస్సాక్షి నన్ను పట్టి పీకిపెట్టింది. 'ఎందుకోయ్ జంబూ, నీ సహవాసగాండ్లను విడిచిపెట్టివచ్చావ్? అందులోనూ ...చి కష్టదశలో! మంచికాలంలో వచ్చిఉండినా ఫరవాలేకుండేది; ...ష్టకాలంలోకూడా ఉండినవారితో కూడా ఉండడంకదా స్నేహ ...ధర్మం! నిజమైన స్నేహితులు అదికదా చేయవలసింది! జంబూ, ... చేసింది మహాతప్పుసుమా! వెంటనే పోయి వారిక్షమాపణ ...' అని నా మనస్సాక్షి నాకు పదేపదే చెప్పుతూ వచ్చింది. ...లారా, నేను బుద్ధి గడ్డితిని మహా తప్పుపనిచేశాను. నన్ను ...ంచండి; మంచిమనసుచేసి నన్ను మన్నించండి,'' అంటూ జంబూ గడగడ వణకుతున్న గొంతుతో, చెప్పలేక చెప్పలేక చెప్పుకొన్నాడు. కళ్లలో నీళ్ళు జలజల కురిశాయి.



చిన్నతిమ్మన్న అన్నయ్య ముఖం చూశాడు. 'జంబూ మాటలు నిజమేనా?' అని అడుగుతున్నట్లుగా తోచింది ఆ చూపు. కాని అదేమీ అర్థంకానట్లే ప్రవర్తించాడు తిమ్మన్న. తిరిగివచ్చినముగ్గురు సహచరులనూ దగ్గరకు తీసుకొని వీపులు నిమిరి బుజ్జగించాడు. "మీరు తిరిగిరావడం మంచిదయింది. మనమందరం కలసి మెలిసి జీవిద్దాం. ఇన్నాళ్లమాదిరి కాదు, అంతకన్నా సుఖంగా ఉందాం. మరి యిక సాధన ఆరంభిద్దామా?" అన్నాడు.



ఆ మృగాలన్నిటికీ ఒక్కొక్క దానికి ఒక్కొక ప్రత్యేకమైన నేర్పుగలిగింది. ఆ నేర్పు పుట్టుకతోనే వచ్చింది. దానిదాని నేర్పుకు తగినట్లు దానిదానికి ఒక్కొకవిద్య నేర్పించాడు తిమ్మన్న తీరిగ్గా. నేర్పేటప్పుడు తిమ్మన్న తిమ్మన్నగా కనబడలేదు. సాక్షాత్తూ గోవిందరావు మాస్టారులాగానే కనిపించాడు. గొంతుకూడా సరిగ్గా అయన గొంతే! గోవిందరావుమాస్టారే తిమ్మన్నరూపంలో తమ యెదుట ప్రత్యక్షమై తమ కవన్నీ స్వయంగా నేర్పుతున్నట్లే వాటికి తేట తెల్లమయిపోయింది.

సాధన రోజూ యథాక్రమంగా కొనసాగింది. ఇలా మూడు వారాలు గడిచాయి. అందరూకూడ వారివారి పాఠాలు వారువారు గా నేర్చుకొన్నారు. ఆయా విద్యల్లో బాగా ఆరితేరారు. మంచి దలో తట్టిలేపి, "ఏదీ, ఆవిద్య చేసిచూపించు!" అన్నాకూడ ముకోకుండా వెంటనే చేసి చూపించేటట్లు తయారైనారు. ఆ ంచడంలోకూడా పట్టుపట్టి వెదకినా ఒక్క పొరపాటూ కన బడదు. "ఇదివరకు నా విద్యలు చూచి అందరూ చేతులుతట్టి హర్ష ధ్వానాలు చేసేవారు. హుఁ! అవేమివిద్యలు! ఇప్పటి ఈ కొత్త విద్యలు—ఓహ్! నామటుకు నాకే ఆశ్చర్యం కలిగిస్తున్నాయి! ఇక చూచేవారికి ఇంకెంత ఆశ్చర్యం కలిగిస్తాయో! దేవుడు మేలుచేసి వారలాగే దిగ్భ్రమపడి మూర్ఛపడిపోకుండా ఉండాలి!" అని ఒక్కొక్క మృగమూ దేనికది తలపోస్తూవచ్చింది.

"చాలు. ఇక ఈ సాధన చాలు. రేపే మనం ఈ ఇంటి నుంచి కదిలిపోదాం. నేటికి సరిగ్గా పదవరోజున మన కొత్తసర్కసుకు ప్రారంభోత్సవం జరుపుదాం" అని తిమ్మన్న నిండుసభలో తెలియ జేశాడు.

పదవరోజు! ఆ పండగరోజు ఎప్పుడు వస్తుందా అని మృగా లన్నీ కలలుకంటూ వేళ్ళు లెక్కపెట్టుకొంటూ దినమొకయుగంగా డుపుతూ కూర్చున్నాయి.

కేశప్ప పెట్టిన నెలరోజుల గడువు ముగిసిపోయింది. అది ఎప్పుడెప్పుడు ముగుస్తుందా అని కాచుకూర్చున్న కాళప్పా, వకీలయ్యా వెంటనే విసవిస వచ్చి, చట్టప్రకారం మృగాలన్నీ బయటికి గెంటి పగతీర్చుకొందామని కొండంత ఆశతో ఆ యింట్లోకి జొరబడ్డారు. కాని, పాపం, వారి ఆశలు అడియాసలైనాయి. అసలు అక్కడ మృగాలు ఉంటేనా! మేజామీద ఒక్క జాబుమాత్రం ఉండేంది. కాళప్ప దానిని చేతికి తీసుకొని ఆత్రంగా చదివాడు.

"కేశప్పకూ, వకీలయ్యకూ వ్రాసుకొన్నదేమంటే—మేమిదిగో మీయిల్లు ఖాళీచేసి వెళ్ళిపోతున్నాం. చట్టప్రకారం మీయిల్లు మీరు మహారాజుగా తీసుకోవచ్చు. అయితే, ఒక్కసంగతి. మేమీయిల్లు వదలిపెట్టి పోతున్నామేగాని ఊరు విడిచిపెట్టిపోవడంలే దేశమూ విడిచిపెట్టిపోవడంలేదు. మేమొక సర్కసుకం భించాము. నేటికి తొమ్మిదవరోజున దానికి ప్రారంభోత్స జరపబోతున్నాం. అదికూడ ఎక్కడో కాదు—ఈ

ఇట్లు: సర్క

"

# 3

"పట్టి మృగాల సర్కస్సా?"

"మాటవరసకైనా ఒక్క మనిషికూడ లేని :

"పిల్లలను మాత్రమే చూడనిచ్చే సర్కస్సా?

—ఇలా ప్రశ్నలపై ప్రశ్నలు ప్రజల్లో బయలుదేరాయి. కాని, ఒక్కరికీ జవాబుమాత్రం స్ఫురించలేదు.

ఒక చిన్న డేరా లేచింది. మృగాలే చేతులారా కట్టిన డేరా అది. అందులో ఎన్నెన్ని వినోదాలని! అవేమిటో చూద్దా

మని బాలబాలికలకు పట్టరాని ఆశ! సందులగుండా, కంతలగుండా చూద్దామంటే, మళ్లీ భయం!...వద్దు బాబూ, వద్దు! మృగాలు కదూ! వాటికి పట్టుబడితే, ప్రాణాంతకమే! పట్టి పీకిపెట్టవూ!

సాయంకాలం ఆరుగంటలకు సర్కస్సు ఆరంభం. అయిదు గంటలకే డేరా బాలబాలికలతో నిండి కిటకిట లాడిపోయింది. వారిలో పెద్దవారొక్కరూ లేరు. ఎలా ఉంటారు? పోదామన్నా, వారికి లోపలికి ప్రవేశం దొరకదుగా!

సర్కసు చూద్దామని పెద్దవారికీ చాలా ఆశగానే ఉంది. కాని, ఆసంగతి బయటికి చెప్పుకోలేరు. మర్యాదకు లోపంకదూ మరి!
!"హుఁ. సర్కస్సట! అది పసిపిల్లలకేగా! దానిజోలి మన
కుకు?" అన్నారు గంభీరంగా. అయితే నిజానికి అవి పైపై
ఇప్పుడు ఆ సర్కసు చూడాలని లోలోపల వారికీ ఉబ
ఉంది. ఏమిటి దారి? యోచించారు, యోచించారు.
దొరికింది. పసిపిల్లలను వంటరిగా ఎలా పంపడం?
నా వెళ్లకపోతే ఎలా?" అంటూ మొదలెట్టారు.
మీ సాగేటట్లు కనబడలేదు. ఇటువంటి కుంటి
గారు వినిపించుకొంటేనా? ఏమైనాసరే, పెద్ద
వ్వమని వారు ఖండితంగా చెప్పివేశారు. ఆపైన
చుకొన్నారు. "హుఁ! జంతువుల సర్కస్ట,
. మీకేమి పిచ్చా, వెర్రా! పసిపిల్లలను ఉసి
ాచుకోవడానికి ఎవరోవేసిన ఎత్తు ఇది. అంతగాక
ంట ఇది!" అన్నారు. కాని పసిపిల్లలుమాత్రం
• లక్ష్యం చేయలేదు. గుంపులు గుంపులుగా సర్కసు
ంకొన్నారు.

గోడలాగా చుట్టూరా ఇంతెత్తున వెదురు తడకలతో దడి కట్టిపెట్టారు. ఆ దడిలో ఒకచోట టిక్కెట్లివ్వడానికి ఒక కంతచేసి పెట్టారు. గుంటనక్క జంబూ టిక్కెట్లమ్ముతున్నాడు. ఒక్కొక్క టిక్కెట్టు పావలా!

డేరాలో సరియైన జాగాకోసం పిల్లలు బలేగలాటా చేస్తున్నారు. కీచులాటలు, తోపులాటలు, అరపులు, కేకలు, తిట్లు, కొట్లతో డేరా అంతా ఒకటే గగ్గోలుగా ఉంది.

ఇంతలోకే ఉన్నట్లుండి ఒక ఈల వినబడింది. సర్కస్ ఆరంభంకాబోతున్నదని చాటే హెచ్చరిక అది! వెంటనే ప్రేక్షకులు గోల కట్టిపెట్టి ఎక్కడివారక్కడ సర్దుకొని నెమ్మదిగా కూర్చున్నారు. అంతవరకూ కాకిగోలతో గగ్గోలెత్తిపోయిన డేరా అంతా ఒక్కక్షణంలో చీమ చిటుక్కుమన్నా వినిపించేటంత నిశ్శబ్దంతో నిండిపోయింది.

సర్కసు ఆరంభమయింది.

మొట్టమొదట ఆట ట్రపీజ్ అనే ఉయ్యాలాట. ఆడినవారెవరో తెలుసా? రెండు ఎలుగుబంట్లు. పైన అడ్డంగానూ, నిడుపుగాను చాలా కమ్మీలు కట్టిపెట్టారు. రెండువైపులా బోలెడెత్తున రెండు ఊయలలు వ్రేలాడగట్టారు. రెండు ఎలుగుబంట్లూ చెరిఒక ఉయ్యాల మీదెక్కి ఎదురుబదురుగా ఉయ్యాల ఊగడం మొదలుపెట్టాయి. ఒకటికొకటి పోటీలుపడి అతివేగంగా ఊగుతున్నాయి. అలా ఊగుతూ ఊగుతూనే అవి రెండూ తటాలున ఒక్క ఊపుతో ఎదురెదురు ఊయాలలను లంకించుకొని వాటిమీదికెక్కాయి. ఇలా అవి చాలా సార్లు చేశాయి. అద్భుతమైన ఈ ఆటచూచి పిల్లలు చాలా సంతోషించారు.

వట్టి ఉయ్యాలఊగడం మాత్రమేనా? ఊగులాడుతూ ఊగులాడుతూనే ఆ ఎలుగుబంట్లు చాలాసార్లు పిల్లిమంత్రాలుకూడ వేశాయి. ముందుకుమాత్రమేకాదు, వెనుకకుకూడ వేశాయి. ఆ పిల్లిమంత్రాల్లోకూడ ఒక్కొక్కసారి ఒక్కొక్కవిధం! ఊగిఊగి ఎదురు ఊయ్యాల లంకించుకొనేలోపలే, అది ఎలా వేసేవోకాని, బాగ్గా రెండుమూడు పిల్లిమంత్రాలు ఒక్కఊపున వేసేవి. ఆ రెండు ఎలుగులూ ఎట్టిటోపీలు పెట్టుకొనిఉన్నాయి. అంతరాళంలో ఎదుటి





ఊయ్యాలమీదికి ఉరుకుతూ ఉరుకుతూనే అవి అతిలఘువుగా తమ టోపీలు మార్చుకొనేవి. బాల బాలికల్లో ందరు ఇదివరకు కాళప్ప సర్కసు చూశారు. అందులో ఈ ట్రపీజ్ ఆటకూడ చూపేవారు. కాని అది చాలా చప్పచప్పగా మామూలుగా ఉండేది. అదీ ఇదీ చూచిన వారి కండ్లకు ఈ ఎలుగుబంట్ల ఆట ఎంతో అద్భుతంగా కనిపించింది.

పిల్లలు అడపాదడపా తమ సంతోషం పట్టలేక హర్షధ్వానాలు చేస్తూవచ్చారు. తిమ్మన్న ఆ హర్షధ్వానాలకు ఎప్పటికప్పుడు





కొంచెం కలవరపడుతూ, వాటిని జాగ్రత్తగా చూస్తూవచ్చాడు. ట్రపీజ్ ఆట ముగిసింది. ఎలుగులు కిందికి దిగివచ్చాయి.

"ప్రియమైన పిల్లల్లారా! విద్దెలు చేసి చూపేటప్పుడు శబ్దం చేయకండి. ఆటగాళ్ల దృష్టి చెదరిపోవచ్చు. అలా చెదరిపోయి, పొరపాటున వారి చేతిపట్టు తప్పిపోతే...? కిందపడి చావవలసిందే! మనుషుల సర్కసులో అయితే ఈ ప్రమాదం ఉండదు. కింద వల కట్టిపెట్టి ఉంటారు. ఆటగాళ్ళు పడినా అందులోనే పడుతారు. అంతే కాక, ఇవి ఇంకా ఈ విద్దెలలో బాగా తయారుకాలేదు. అంమష ఇంకా కొన్నినాళ్ళు పడుతుంది. వరకూ కొంచెం ఓర్పుతో ఉండాలి, తిమ్మన్న అడుగుకొన్నాడు.



మేనేజరు తిమ్మన్నమాటలు పిల్లలమనసు కెక్కాయి. అటు తర్వాత సర్కసు ప్రదర్శనం ముగిసేవరకూ కూడ పిల్లలు శబ్దం చేయనేలేదు. కాని ఒక్కొక్క ఆట ముగిసినప్పుడుమాత్రం కరతాళధ్వనులతోనూ, హర్షధ్వానాలతోనూ డేరా ఎక్కడ ఎగిరిపోతుందో అన్నంతగా సందడి జరిగేది.

తర్వాత పులులవంతు వచ్చింది. ఒకపక్కన ఒక పలకను నిలబెట్టారు. దానికి జేరగిలబడి నిలుచున్నాడు చల్లయ్య. అతనికి 40 గజాల దూరంలో నిలుచున్నాడు పల్లయ్య. అతనిముందర పెద్ద పెద్ద కత్తులు—నూనెగుడ్డలు చుట్టి కట్టిన కత్తులు—పేర్చి పెట్టారు. పల్లయ్య ఒక్కొక్క కత్తే తీసి నిప్పు అంటించాడు. అతని కండ్లకు నల్లగుడ్డతో గంతలువేరే కట్టిపెట్టారు. అంతే కాదు. చల్లయ్య పల్లయ్యకు ఎదురుగ్గా లేడు; వెనకపక్కగా నిలుచున్నాడు. అంటించిన కత్తులను పల్లయ్య ఒకటి౦ట

ఒకటిగా వెనుకకు విసురుతూవచ్చాడు. విసిరిన ఒక
మొనా సరక్కున ఆపలకలో దిగబడుతూ వచ్చింది. పలకకు
నిలుచుకొన్న చల్లయ్య శరీరానికి చేరిగ్గా ఆ కత్తులు తీగ
గుచ్చుకొని పోయాయి.

కండ్లకు గంతలు కట్టుకొనికత్తులు విసిరేవారు మ
సర్కస్సుల్లో చాలామంది ఉంటారు. వారిలో కొందరిని కొ
కొందరు పిల్లలు చూచికూడ ఉండవచ్చు. కాని వెనుకవైపు
విసరడంమాత్రం ఇంతవరకూ ఒక్క పల్లయ్యపులిమాత్రమే
చూపించాడు. అందులో ఇంకొక విశేషంకూడాను. అతడు
చోటనే, ఉన్నవాడున్నట్లే కత్తులు విసరలేదు. ఎగురుతూ డి
తూనూ, పిల్లిమంత్రాలు వేస్తూనూ, పల్టీలుకొడుతూనూగ
అతడు కత్తులువిసురుతూ వచ్చాడు; కత్తులువిసిరే ఆట ముగియ
గానే పలకకు జేరగిలబడి నిలుచుకొనియుండిన పులి కాస్తా ఇవ
లకు వచ్చివేసింది. పలకలో కత్తులుమాత్రమే—ఒక పులి ఆ
రంలో నిలిచాయి! మేనేజరు తిమ్మన్న రంగంలోకి వచ్చాడు.

"ప్రొఫెసర్ జంబూ! ఇంద్రజాలం, మహేంద్రజాలం విద్యల్లో
ప్రొఫెసర్ జంబూను మించినవారు ఎవరూలేరు. ఆయన ఇప్పుడు
కొన్ని తమాషాలు చేసిచూపుతారు," అని సభవారికి తెలిపి వెళ్ళి
పోయాడు.

ప్రొఫెసర్ జంబూ రంగానికి వచ్చారు. నలుపక్కలా చూచి
నైసుగా తలవంచి నమస్కరించారు. నలుపు బూట్సు, నలుపు నిజారు,
నలుపుకోటు, నలుపుటై, నలుపుటోపీ, చేతిలో ఒక నలుపుకర్ర—
వీటితో బలే షోకుగా, జోరుగా ఉన్నారు.

"అరెరే! ఇది టిక్కెట్లుఅమ్మిన గుంటనక్క —!" అంట
చాలామంది చాటుచాటుగానే అనుకొన్నారు.

పీఠికలూ ఉపోద్ఘాతాలూ ఏవీ లేకుండ
తమ విద్యాప్రదర్శనాన్ని సరాసరి ఆరంభించా

ఎవంటి విద్యలు చూపింది లేదు. చిన్నతిమ్మన్నను దగ్గరికి
న్నారు. ఛూమంత్రకాళీ అని చిన్నతిమ్మన్నను నిలుచున్న
గానే నేలమీదినుంచి పైకి పైకి లేపిస్తూపోయారు. చిన్న
అంతరాళంలో అలా అలా వెళ్ళి వెళ్ళి డేరా కొసకు చేరు
డు. ఆపిమ్మట ప్రొఫెసరుగారు ఆయనను అలాగే మెల్లి
ల్లిగా కిందికి దింపారు.

తర్వాత సింగన్నను రమ్మన్నారు. ఒక కొయ్యబోను తెప్పించి
గోకి ఎక్కించారు. బోనుకు నిప్పంటించారు. బోను ధగధగ
కాసేపటికి ఆరిపోయింది. సింహం జాడగూడ లేదు. సందేహ
దుకు కాలి కాలి నుసి అయిపోయి ఉంటుందని పిల్లలందరు గొల్లు
మని ఏడుపు మొదలుపెట్టారు. ఇంతలోనే సింగన్న ఎలా వచ్చిందో
గాని పిల్లల గుంపులోనుంచే రంగంలోకి వచ్చి నిలుచున్నది, ముసి
ముసి నవ్వులతో.

పిమ్మట ప్రొఫెసర్ జంబూ ఒక మామిడిటెంక తీసుకొన్నారు.
నలుగురూ చూస్తుండగానే దానిని నేలలో నాటారు. దానికి నీళ్లు
పోశారు. ఆశ్చర్యం! ఆశ్చర్యం! చూస్తూ చూస్తూ ఉండగానే అది
మొలకయెత్తింది. మరి కాసేపటికి అలా అలా పెరిగి పెరిగి పెద్ద
చెట్టయిపోయింది. నిండుగా పూచింది. దండిగా కాయలు కాసింది.
అంతలోనే కాయలు పండాయి. వెంటనే ప్రొఫెసరు జంబూ ఒక
చిక్కం తెప్పించి దోటీతో పండ్లను దింపి, వాటిని ఒకటొకటిగా తీసి
పిల్లలవేపు విసిరారు. పిల్లలుకూడ దొరికినవి దొరికినట్లు అంది పుచ్చు
కొని అలాగే తిన్నారు. ఆహాహా! ఏమిరుచి, ఏమిరుచి! కాని, కాసే
పటికల్లా అన్నీ మటుమాయం. మామిడిచెట్టూ లేదు; మామిడిపళ్లూ
లేవు; తిన ... కూడ లేదు. అంతా గారడీ! అంతా కనుకట్టువిద్య!

ంచుకొ- ఒంటెలూ, గుఱ్ఱాలూ సరసర వచ్చి
నిలుచున్నాయి. అన్నికూడ శుభ్రంగా పళ
కీసుకొన్నాయి. ఒంటెలేమో పచ్చవీ, గుఱ్ఱా

లేమో ఎట్టివీ ధరించాయి. ఒంటెలన్నీ ఒకపక్కనా, గుఱ్ఱాలన్నీ ఒకపక్కనా నిలుచున్నాయి. అవి అలా నిలిచినతీరు చూస్తూఉంటే పిల్లలకు ఎంతో ఆశ్చర్యకరంగా ఉంది. అవి నిలిచిందికూడ వట్టి నేల మీద కానేకాదు; దొర్లిదొర్లిపోయే పీపాలమీద. బాగా సాధన చేసిచేసి ఆరితేరినవారైతేనే అలా నిబ్బరంగా నిలవగలుగుతారు! సాధనలేకుండా కాలుపెడితే పీపా కాస్తా సరసర దొర్లుకొనిపోతుంది. అంతతో ఆ కాలుపెట్టిన ఆసామికాస్తా 'తధికిటతోం' అంటూ దబుక్కున కిందపడిపోతాడు; కాళ్లూ చేతులూ విరుగుతాయి; పండ్లు ఊడుతాయి. కానైతే, అవి అన్నీకూడ దిగులూ భయం లేకుండా పీపాలమీద దిట్టంగా నిలుచుకొన్నాయి. ఒక్కొక్కదాని చేతిలోనూ ఒక వంకర కఱ్ఱఉంది. రెండు జట్లకూ మధ్య ఒక బంతి ఉంది! ఓహో! హాకీ ఆటకు కాబోలు ఈ సన్నాహమంతా! పరుగెత్తి పరుగెత్తి ఆడేబదులు పీపాలు దొర్లించుకొంటూ దొర్లించుకుంటూ కాబోలు!

ఇది ఒక సరికొత్తతరహా హాకీ ఆట! మధ్యస్థం పెద్దమనిషిగా తిమ్మన్న వచ్చాడు. వచ్చీ రాంగానే ఈల ఊదాడు. ఆట ఆరంభమయింది. అరెరే! పీపాలు ఎంత వేగంగా దొర్లుతున్నాయి! అయినా ఒక్క మృగంకూడ పడిపోలేదు! బలే! ఎటువంటి హాకీ ఆట! చివరకు ఒంటెలు మూడు గోళ్ళుచేశాయి; గుఱ్ఱాలు రెండు గోళ్ళుచేశాయి! పిల్లల్లో కొందరు గుఱ్ఱాలపక్షంవారు. "ఇవాళ గుఱ్ఱాలు లేచినవేళా విశేషం బాగాలేక ఓడిపోయాయి. పోతే పోయాయి! రేపటి ఆటలో తప్పకుండా విజయం వాటికే, చూస్తూ ఉండండి కావలిస్తే!" అన్నారు. ఒంటెలపక్షంలోని పిల్లలు ఆమాటకు ఒంటికాలిమీద లేచారు. "అది కలలోమాట. రేపుకూడ ఒంటెలే గెలుస్తాయి. కచ్చితంగా! ఏమనుకొన్నారోమరి! అవి ఈ ఆటలో ఘనాపాటులుసుమా!" అని ఆర్భాటంచేశారు. ఇలా వారిలో వారికి మాటలపోరు ఆరంభమైంది. ఇంకాస్త సాగితే చేతులూ చేతులూ కలిసేటట్లు తోచింది. కాని, దేవుడు మే

ఎంటి పరిస్థితి రాలేదు. ఎందువల్లనో తెలుసా? ఈ అదను చూచుకొని గజేంద్రుడు గభీమని రంగంలోకి వచ్చి వాలాడు!

గజేంద్రుడుకూడ గమ్మత్తయిన విద్యలు అనేకం చేసిచూపించాడు. ముప్ఫయి అడుగుల ఎత్తులో పొడుగ్గా ఒక తీగ కట్టిపెట్టారు. నిచ్చెన తెప్పించుకొని గజేంద్రుడు దానిపైకి ఎక్కాడు. "ప్రియమైన పిల్లల్లారా! కాస్త గోలచేయకండి. చేస్తే, గజేంద్రుని గురి తప్పిపోవచ్చు. తప్పిపోయి, కర్మంచాలక పడిపోతే...? అలా పోతే గీతే ఏమవుతుందో కొంచెం యోచించి చూడండి. గజేంద్రుడిప్పుడు మీరు కలలోకూడ చూచియుండని అనేక అద్భుతవిద్యలు చేసి చూపబోతున్నాడు. ఆ సంతోషంలో మీకు హర్షధ్వానాలు చెయ్యాలనిపించవచ్చు. కాని, మీకు పుణ్యముంటుంది, ఆకోరిక కాస్త అణచిపెట్టుకోండి," అని తిమ్మన్న పిల్లలకు ప్రాధేయపూర్వకంగా చెప్పుకొన్నాడు. పిల్లలు పరిస్థితి అర్థంచేసుకొన్నారు. నోరూ వాయీ కదిలించకుండ కుదురుగా కూర్చొన్నారు.

తొండాన్నీ, చెవులనూ అలాఇలా ఆడించుకొంటూనే గజేంద్రుడు తీగమీద తిన్నగా నడిచాడు. నడిమధ్యకు వచ్చి నిలుచుకొన్నాడు. ఎలుగు లొకనిచ్చెన తెచ్చున్నాయి. చిన్న తిమ్మన్న ఒక పళ్లెం తీసుకొని నిచ్చెన ఎక్కాడు. ఆ పళ్లెంలో ఒకడజను కప్పులూ, ఒకడజను సాసర్లూ ఉన్నాయి. వాటికి తోడు ఒక పాలపాత్రకూడ ఉంది. తీగమీద తిష్ఠవేసిన గజేంద్రుడు తొండం ఆడిస్తూనే కుడికాలు చూపాడు. చిన్న తిమ్మన్న ఆ కాలిపైన ఒక సాసరు పెట్టాడు. వెంటనే గజేంద్రుడు తొండంతో ఆ సాసరు తీసుకొని పైకి విసిరాడు. అది పైకి పోయి మళ్లీ పల్టీలు కొడుతూ కిందికి దిగివచ్చి ఆగిపోయింది. ఎక్కడనుకొన్నారు? గజేంద్రుని తొండం కొనమీదనే!

చిన్న తిమ్మన్న ఒక కప్పులో పాలుపోసి ఆ కప్పుకూడ దుని కాలిమీద పెట్టాడు. మరుక్షణంలోనే ఆ పాలకప్పు గిర

గిర అరుగుతూ పైకి లేచిపోయి తిరిగి అదేదారిన దిగివచ్చి తొండం నోటిమీద ఉన్న సాసరులో తిష్ఠవేసింది. ఏమాశ్చర్యం! ఒక్క బొట్టు పాలు కూడ చిందలేదు. ఇలాగే పండెండు సాసర్లూ కప్పులూ వరసాగ్గా వెళ్లి తొండం కొనలో ఒకటిపైన ఒకటి కుదిరిగ్గా పేర్చి పెట్టినట్లు కూర్చున్నాయి.

పిల్లలచేతులు తనిచ్చుగా ఒకటినొకటి కలుసుకోబోయినాయి. శబ్దం గొంతుదాకా వచ్చింది. కాని, దేవుని పుణ్యాన సమయానికి సరిగ్గా చిన్న తిమ్మన్న హెచ్చరిక వారికి జ్ఞాపకంవచ్చింది. బుద్ధిగడ్డితిని కరతాళధ్వనులతో గోలచేస్తే అయ్యయ్యో, ఇంకేముంది, గజేంద్రుడు పడిపోవలసిందే! పిల్లలచేతులు ఉన్నవున్నట్లు దూరదూరంగానే ఉండిపోయాయి; శబ్దంకూడ గొంతులో అల్లాగే అణగిపోయింది. అదిగో గజేంద్రుడు తొండం ఆడించాడు. సాసర్లూ



క్రమంగా కిందికి దిగివచ్చాయి. కుడి ముంగాలుమీద ముచ్చటగా కూర్చున్నాయి. చిన్న తిమ్మన్న వాటిని తీసుకొని కిందికి అందించాడు. ఇంత తంతు జరిగినా ఒక్క చుక్క పాలుకూడ కింద పడలేదు. ఆ తర్వాత పాలు పడిపోవడం ఆరంభించాయి. ఎక్కడ? నేలమీదనా? కాదు, కాదు, చిన్న తిమ్మన్ననోటిలోకీ, నిచ్చెన పట్టుకొని ఉన్న ఎలుగుల నోటిలోకీ! ఇంతలో గజేంద్రుడు కిందికి దిగాడు. ఇక అంతే! పిల్లల కరతాళ ధ్వనులూ కలకలమూ అణగడానికి అల్లంతసేపు పట్టింది.

చిన్న తిమ్మన్న వేషం చూస్తే చాలు; చిన్నపిల్లలకు నవ్వు ...కువస్తుంది. ఉండడానికేమో నిజారు, చొక్కా, కోటు, ... ...ంటాయి. కాని అన్నీ చిరుగులమయమే! తలమీద తలకు ...డుగాటి కుల్లాయి. ఆ కుల్లాయి కొసనుంచి వేళ్లాడుతూ ... ముఖానికి అంగుళం మందాన రంగుపూత. ఈ ... అతగాడు ఆడిన వెకిలి వెకిలి మాటలూ, చేసిన ...లూ పిల్లలను పొట్ట చెక్కలయ్యేట్లు నవ్వించాయి.

...ల్లిమంత్రాలూ, పల్టీలూ ప్రేక్షకులను బలేబలేగా ...ఇలా లగువులువేసే సర్కసు మనుషులను వారు ... చూశారు. కాని ఈ సింగన్న చేసిన లగువుల ...లా దిగదుడుపే! నేలమీద చేతులూను ...డు చేసే పిల్లిమంతరం చూచితీరవలసిందే ... తలకిందులుగా నిలుచున్నట్లే ఇతగాడు ...వరసగా నిలుచొన్న గుర్రాలనూ ఒంటె ...వస్తాడు. వెనుకపక్కగా కూడ ఇలాంటి ...ఒక్క ఊపున పైకెగిరి ముచ్చటగా ...ఇంచక్కా నిటారున నిలుచుకొం... శరీరమేమైనా రబ్బరుశరీరమా?

"ప్రియమైనా పిల్లల్లారా! ఇక కాసేపట్లో సర్కసు ముగిసీ పోతుంది. ఇంకొక్క ఆటమాత్రమే ఉంది. అది అయిపోగానే మీ రందరూ మీమీ యిళ్లకు వెళ్లిపోవచ్చు." అని మేనేజరు తిమ్మన్న సభవారందరికీ తెలియజేశాడు.

నాలుగుమూలల్లోనూ పీపాలు పెట్టారు. గజేంద్రుడు ఒక పీపా దగ్గరకు వెళ్లాడు. ఏమివిద్య చేయబోతాడబ్బా అని పిల్లలందరూ కళ్లు ఇంతవి చేసుకొని చూస్తున్నారు.

గజేంద్రుడు పీపాలోకి తొండాన్ని పోనిచ్చి బయటికితీశాడు. ఏమి శేమిటి? వానకురుస్తున్నదా ఏమి? లేదులేదు. గజేంద్రుడు తొండంతో నీళ్ళు చిమ్ముతున్నాడు. అవన్నీ ఎఱ్ఱరంగు నీళ్ళు. పిల్ల లందరూ తప్పుకొని పోదామని చూచారు. ఇంతలో ఇంకొకమూల నున్న పీపావద్దకు వెళ్లాడు గజేంద్రుడు. అందులోనుంచి పచ్చనీళ్ళు పీల్చి చిమ్మాడు. పిల్లలు బిత్తరపోయి నలుపక్కలకూ పారిపోవ డానికి ఆరంభించారు. కాని అంతలోపలే గజేంద్రుడు వారికి దిక్కూ- దిశా తోచకుండా నీలిరంగు నీళ్లనూ, పసుపునీళ్లనూ పనికట్టుకొని చిమ్మాడు.

పిల్లలందరి చొక్కాలూ, తుండుగుడ్డలూ తడిసి ముద్దలై పోయాయి. రంగు తగలనివాడు ఆ గుంపులో ఒక్కడంటే ఒక్కడు కూడ లేదు.

అయితే నేమిలే! ఏమీ ఫరవాలేదు. మృగాల సర్క చూడగలిగాముగా! అంతే చాలు. అదిన్నీ ఎంత అద్భుత సర్కసు! ఇది రేపుకూడ చూడాలి. ఆ మరునాడుకూడ చూ ఎన్నితడవలు చూచినాకూడ 'ఇక చాలునబ్బా' అనడా రావడం లేదు.

ఆరాత్రి పిల్లలందరికీ ఈ మృగాల సర్కస్సు క కలల్లోనూ ఆద్యంతమూ ఇదే దర్శనమిచ్చింది.



# 4

'రాముడూ, మృగాల సర్కస్సు పట్నానికి వచ్చిందట. చూద్దాం వస్తావా? అని కృష్ణుడడిగాడు.

సర్కసు మాటవింటేనే రామునికి మహాసంతోషం. ఇక
? పట్టపగ్గాలుండవు. కాని, ఇంతవరకూ వాడు సర్కసు
లేదు. ఇప్పుడు దగ్గర్లోని పట్నానికి వచ్చింది. అదైనా
సర్కస్సా? కాదు; మృగాల సర్కస్సు! చూచితీరా
'ఎలా వెళ్లడం?' అన్న యోచన గట్టిగా పట్టుకుంది.
బదులే చెప్పవు? సర్కస్‌కు వస్తానంటావా,
మళ్ళీ అడిగాడు కృష్ణుడు.

"కృష్ణా! నీకు తెలియదూ నాపరిస్థితి? ఇంతా అంతా ఆశ కాదు. ఇప్పుడు కాదప్పుడు చూద్దామనే ఉంది. కాని, ఎలా రావడమా అనేదే ప్రశ్న. ఏమీ తోచడంలేదు," అంటూ రాముడు ఒక పెద్ద నిట్టూర్పు విడిచాడు.

"ఒకటి నిశ్చయం. మరి కొన్నాళ్లకెల్లా ఆ సర్కస్సు ఇంకొక ఊరికి వెళ్లిపోతుంది. తర్వాత ఏడ్చి లాభంలేదు. వచ్చే శనివారం నాడు నేను పోతాను. నాతో వస్తావా?"

రాముడేమీ బదులు చెప్పలేదు. సర్కస్సుకు పోతే ప్రమాదం. ఏమిటా ప్రమాదం? అది తలచుకొంటేనే వాడి ఒళ్ళు గడగడ వణికిపోతున్నది.

"ఏమైనాకానీ, ఏమైనారానీ. ప్రాణంపోయినాసరే! సర్కస్సుకు వెళ్లవలసిందే, చూచితీరవలసిందే!" అని రాముడు చివరకొక గట్టి నిశ్చయానికి వచ్చాడు. వాడు చెయ్యబూనుకొన్నది నిజంగా పెద్దపనే. ఉన్నట్టుండి అంత పని చెయ్యడానికి ధైర్యం ఎలా వచ్చిందబ్బా! ఎవరికీ అంతుపట్టలేదు. యోచించి యోచించి, కడపటికి "కృష్ణా, నేనూ వస్తాను," అన్నాడు.

కృష్ణుడు చాలా సంతోషించాడు. 'బలేబాగు, బలేబాగు' అన్నాడు. "రాముడూ, ఈ కాలిబాట వెంటబడి మూడుమైళ్ళు పోతే పక్కారోడ్డు వస్తుంది. ఆ రోడ్డులో నాలుగుమైళ్ళునడిస్తే పట్నం చేరుకొంటాము. ఒంటిగంటకెల్లా మనం ఇక్కడనుంచి బయలుదేరాలి. శనివారం ఒంటిగంటలోపల ఇక్కడికి వచ్చివెయ్యి. నేను సిద్ధంగా కాచుకొని ఉంటాను," అని చెప్పి కృష్ణుడు వెళ్ళిపోయాడు.

రాముడు చెట్టుకు జేరగిలబడి కూర్చొని అలాగే ఉండిపోయాడు. మిట్టమధ్యాహ్నం. ఎండ మండిపోతున్నది. అ... రామునికి ఆ ఎండవేడిమి తెలిసినట్లే లేదు. చెట్లు గొడుగు... తున్నాయి. దగ్గర్లోనే ఒక చిన్నవాగు ...

న్నది. దానిగట్టున పశువులు మేస్తున్నవి. రాముడవేమీ గమనించడమే లేదు. దీర్ఘాలోచనలో మునిగిపోయిఉన్నాడు.

ఈ ఎనిమిదేండ్ల వయస్సులోనే వాడు ఎన్నెన్నికష్టాలు అనుభవించాడు? వాని యజమానిపేరు గంటయ్య. మనిషి ఘటోత్కచుని లాగా భయంకరంగా ఉంటాడు. గానుగలాగా గడిదేరినఒళ్ళు. ఒంటినిండా దట్టమైన వెంట్రుకలు! చూపులకు నిండుగా కంబళి కప్పుకొన్నట్లుంటుంది ఆ తీరు. ఇంతంత లావు పెదవులు. అడుగు పెదవి మరీ బలిసి వేలాడుతూ ఉంటుంది. తాంబూలపు కఱ పేరు కొన్న పెద్ద పెద్ద పండ్లు. అవి కోరల్లాగా బయటికి నిక్కపొడుచుకొని ఉంటాయి. మొత్తానికి అతడొక యమదూతలాగా ఉంటాడు. అయినదానికీ కానిదానికీ అతడు పదేపదే రాముణ్ణి పట్టుకొని బాదుతూ ఉంటాడు. ఆ బాదుడుకు కారణమంటూ ఉండనక్కరే లేదు. "సరి చవటవెధవా; మనిషైనందుకు కాస్తయినా కృతజ్ఞత ఉండవలెరా! దిక్కులేకుండా దేశదిమ్మరులపాలై కూటికీ గుడ్డకూ మొగంవాచియున్న నిన్ను డబ్బిచ్చికొని అన్నంపెట్టి పోషిస్తున్నందుకు ఇదేగదా ఫలితం?"—ఈ ప్రశ్నకు వెనువెంటనే తన్నులూ, బాదుళ్ళూ తగులుతాయి! ఇంతకూ రాముడు కించిత్తు తప్పుకూడ చెయ్యడు; అవమర్యాదగా నడచుకోనూ నడచుకోడు. "బోలెడు డబ్బుపెట్టి నిన్ను నేను దేశదిమ్మరులనుండి కొనలేదూ? అన్నంపెట్టి పెంచి పోషించలేదూ?" అని గంటయ్య మరి మరీ అడుగుతూ ఉంటాడు. నిజానికి చూడబోతే అన్నంపెట్టి పెంచింది గంటయ్య కానేకాదు. గంటయ్య ఇంట్లో ఒక ముసలమ్మ ఉండేది. "రాముడికి అన్నం గిన్నం పెట్టేవు కబడ్దార్!" అని గంటయ్య ఆ ముసలమ్మకు ముందే సుగ్రీవాజ్ఞ వేశాడు. "గంజి కావలిస్తే పొయ్యి. అదికూడ అరకడుపుకుమాత్రమే సుమా!" అని ఆవిడకు ఆయన హుకుం!

"నాకే గనక అమ్మా, అప్పా ఉంటే...?" అని రాముడు అనుకొనేవాడు. తల్లిదండ్రుల ప్రేమనూ. ఆదరణనూ అను ...చుకోలేదు. వారేగనక ఉండివుంటే...?

రాము కి ఈ అవస్థ ఉండేదేకాదు. కడుపునిండా హాయిగా తిండి తింటూ ండి ఉండవచ్చు! అప్పుడు ఈ కొట్లూ, తన్నులూకూడ ఉండేవి వు.

ముని కీ, కృష్ణునికీ ఎంత వ్యత్యాసం! కృష్ణునికి పదహారేండ్లు ఉంటాయి. ఆ వయస్సులోనే అతని కొక చిన్న ఉద్యోగం. పట్నంలో మహమ్మదు జవుళీకొట్టులో లెక్కలు వ్రాయడమే ఆ ఉద్యోగం.

"లెక్కలు కృష్ణునికి కరతలామలకంతో సమానం. గణిత శాస్త్రం అతని ఒంట్లో నరనరాలలోనూ ఊరిపోయింది," అని మహమ్మదు వచ్చినవాళ్లతో అల్లా సదా అంటూ ఉంటాడు. నిజానికి కృష్ణునికి పనికట్టుకొని కూర్చొని లెక్కలు చేయవలసిన అవసరమే లేదు. లెక్కలన్నీ అతనికి కంఠాపాఠం. ఎంతటి లెక్కలిచ్చినాసరే, నోటితోనే క్షణాల్లో చేసివేస్తాడు. నాలుగైదు భిన్నాలుగల పెద్ద లెక్కయినాసరే, ఇచ్చిచూడండి. కూడిక, తీసివేత, గుణకారం, భాగహారం అన్నీకూడ అతడు వేళ్ళమీదనే సునాయాసంగా చేసివేస్తాడు. ప్రతిదినమూ అతడు తెల్లవారిలేచి పట్నంపోతాడు; సాయంకాలానికి తిరిగివస్తాడు. ఇలా వెళ్ళివచ్చేటప్పుడు అతడు అప్పుడప్పుడు రాముణ్ణి దారిలో సంధిస్తూ ఉంటాడు.

రాముడు తన పరిస్థితి తలచుకొని తలచుకొని దుఃఖపడ్డాడు. ఆ ముసలమ్మేగనక లేకుంటే వాడేం చేసేవాడు? అతనికేమీ అవగాహనకాలేదు. ముసలమ్మకేమో ఆ రామునిపైన అలవిమాలిన అభిమానం! కాని, ఆవిడకు గంటయ్యనుచూస్తే భయం! గంటయ్య ఉన్నప్పుడు ఆవిడ రామునితో మాట్లాడనుకూడ మాట్లాడదు. గంటయ్య లేనప్పుడు మాత్రం వాణ్ణి మహా అభిమానంతో చూస్తుంది.

ఒకరోజున గంటయ్య ఎక్కడికో వెళ్ళాడు
రామునికి కడుపునిండా అన్నం వడ్డించింది.
భోంచేస్తున్నాడు. కాని అది ముగిసేలోపలే

...డు గంటయ్య. "ఏమి టేమిటి? ఈ వెధవకు నా ఎరు లేకుం డానే ఆకువేసి అన్నంపెడతావా ?" అంటూ ముసలవ్వ ఉ ...రు చుకుపడ్డాడు. నోటికి వచ్చింది వచ్చినట్లు నానాతిట్లూకొట్టాడు. అన్నంతిన్న పాపానికి రాముణ్ణి పట్టుకొని మొరటుతనంగా కొట్టాడు. ఇది జరిగింది లగాయతు ముసలమ్మ రామునికి బహు జాగ్రతగానే అన్నంపెడుతూ వచ్చింది.

ఇంతకూ ఎవరీముసలమ్మ? గంటయ్యతల్లా? రాముడీప్రశ్నను ముసలమ్మను చాలా చాలా సార్లు అడిగాడు. కాని, ఆవిడ సరియైన బదులు చెప్పనే లేదు. తల్లి అయిఉండదని రాముడనుకొన్నాడు. గంటయ్య అప్పుడప్పుడూ ముసలమ్మను తిడుతూఉంటాడు. తల్లిని కొడుకు లెప్పుడైనా తిడతారా? ఎప్పటికీ తిట్టరు.

ముసలమ్మ చాలానాళ్లుగా ఆయింట్లోనే ఉంది. గంటయ్య తనను కాసులుపెట్టి కొన్నది వాస్తవమా? ఆ సంగతి తెలుసుకోవా లనికూడ రామునికి ఎంతో ఆశ, ఈ సంగతిని గురించికూడే వాడు ముసలమ్మను చాలాసార్లు ఆడిగాడు. దానికిగూడ ఆవిడ బదులు చెప్పలేదు. ఒకనాడు మామూలుకన్నా ప్రాధేయపూర్వకంగా ఈ సంగతి దాచకుండా చెప్పు" అన్నాడు. ముసలమ్మ కళ్లనిండా నీళ్ళు నించింది.

"రామూ, నీకు పుణ్యముంటుంది, ఈ విషయమై మొండి పట్టుపట్టకు. నేను నానోటితో అబద్ధం చెప్పలేను; నిజంచెప్పడానికీ వీలులేదు. ఇది ఒక మహా రహస్యం. తరుణం వచ్చినప్పుడు—ఆ తరుణం అసలు వస్తుందో లేదో మరి—అప్పుడు తప్పక చెబుతాను. ఇక మరి ఈ సంగతి నన్నడగవద్దు," అంటూ దగ్గుత్తికతోనే జవాబు చెప్పింది.

...ప్పగూడదు; అసలువిషయం చెప్పనూ వీల్లేదు. దేహంగా రాముణ్ణి పట్టుకొని బాధింపజొచ్చింది. ...దొరకని బ్రహ్మాసం దేహం.

రామునికి సావాసగాళ్లు లేరు; నేస్తాలు లేరు. వాడు బడిగడప తొక్కింది లేదు. గొడ్లూ గొర్రెలూ మేపుకురావడమొక్కటే అతనిపని. వారానికో నెలకో అప్పుడప్పుడొకసారి కృష్ణుణ్ణి మాత్రం సంధిస్తూ ఉంటాడు. ఇంక వేరే పిల్లలెవరూ అక్కడలేరు. స్నేహంగా ఉండడానికి ఎవ్వరూ లేకపోతే ఎరికైనా కష్టంగా ఉండదూ! అందులోనూ ప్రేమతో తొణికిసలాడే హృదయంగలిగిన ఒక చిన్నవానికి!

మనుషులమీద చూపవలసిన ప్రేమను వాడు మృగాలమీద చూపుతూ వచ్చాడు. తాను మేపుతూవచ్చిన గొడ్డు గోదలపై మిక్కిలి స్నేహం చూపజొచ్చాడు. అవికూడ వీనిపై స్నేహం చూపజొచ్చాయి. వాడు వాటికి కొన్ని విద్యలు నేర్పించి ఉండినాడు. ఆ విద్యలు వాడికి ఎవరూ నేర్పినవికావు. అవి వాడికి పూర్వజన్మ వాసనవల్లనో, లేక పుట్టినవేళా విశేషంవల్లనో, లేక ఆంజనేయుని ఆశీర్వాదం వల్లనో పుట్టుకతోనే అబ్బాయి. ఇవి కాకపోతే ఇంకేం కారణం చెప్పాలి? వాడికి హనుమంతుడిపైన అపారమైన భక్తి. ఒక్కొక్కప్పుడు వాడికి ఆంజనేయస్వామి ఎదురుగ్గా సాక్షాత్కరించినట్టే అనిపిస్తుంది.

రాముడు ఎంత అవలీలగా మృగాలను మచ్చికచేసుకొంటాడు! వాడివద్ద ఒక తెల్లపావురంకూడ ఉంది. వెల్లయ్య అనే ఒక కుక్కగూడ ఉంది. ఆ కుక్కకు వాడు బలేబలే విద్యలు నేర్పాడు.

అనుకొన్న ప్రకారం శనివారంనాడు కృష్ణుడు వస్తాడు. అతడితోపాటు తానుకూడ సర్కస్సుకు పోవడానికి రాముడు నిశ్చయమైతే చేసుకొన్నాడు గాని అసలు పోగలడా అని! గంటయ్యకు తెలీకుండా ఎలా పోవడం? ఒకవేళ ఎలాగో కన్నుగప్పి ...పోతాడనుకో. తర్వాత ఈ సంగతి గంటయ్యకు తెలియకనే ?
తెలిస్తే, గతి?...నిలువునాచీల్చి చంపివెయ్యడూ?
కావల చచ్చినా కాలుపెట్టగూడదని ఆయన ఎన్నడో ఆజ్ఞాపిం...
ఇటువంటి పరిస్థితిలో అంతదూరంలో ఉన్న పట్నానికి పో...

మెలాగు? సర్కస్సు చూడడ మెలాగు? పోకుండానే ఉండవచ్చు. కాని, ఎలా ఉండడం? ఉబికి ఉబికి వచ్చే లోపలి ఉబలాటాన్ని అణచుకో లేకుండా పోతున్నాడే! వస్తానని కృష్ణునికి మాటకూడ ఇచ్చాడాయె. వాడేమో శనివారంనాడు ఒంటిగంట వేళకల్లా వచ్చి కాలిబాటవద్ద కాచుకొని ఉంటాడు. పాపం! ఎంత ధర్మసంకటం వచ్చిపడింది!

పొద్దుగూకేలోపలనే పశువులను మళ్లించుకొని ఇంటికి తోలుకొని పోయాడు. ఇంటి లోగిలిలోనే గంటయ్య ప్రత్యక్షం! "ఏమిరోయ్! ఇంత పొద్దుపోయా ఇంటికి వచ్చేది! అడిగేవాడు లేదనేగా ఇంత పొగరు! ఆలస్యంగా వచ్చినందుకు ఇదిగో బహుమతి!" అంటూ రాముని చెంపమీద ఛెళ్లుమని ఒక్క దెబ్బ వేశాడు. ఆ ఒక్క దెబ్బతోనే వాడి గూబలు అదిరిపోయాయి. అయినా సడీ చప్పుడూ లేకుండా సహించుకొన్నాడు. సహించుకోకుండా చేసేదైనా ఏముంది? పోయి, గంజితాగి, నేలమీద మేనువాల్చాడు. రోజూ అంతే. వట్టినేలమీదనే పండుకొంటాడు. చాపైనా ఉండదు.

మరుసటిదినం పొద్దున గంటయ్య పొలంవేపు వెళ్లాడు. ఆ సమయం చూచుకొని రాముడు ముసలమ్మకు విషయం తెలియజేశా ముసలమ్మ గడగడ లాడిపోయింది. "అయ్యయ్యో! ఏమంటునా ..! గంటయ్యకు తెలిస్తే ప్రాణగండమే! వద్దు వద్దు. నా మాట విని నీవు సర్కస్సుకు పోనేవద్దు. ఆ తలంపే మానుకో," అని బతిమాలింది.

రాముడు ఏమీ బదులు చెప్పలేదు. ఏడుపు లంకించుకొనా ..... భోరుభోరున ఏడ్చాడు. ముసలమ్మ ఆ యేడుపు చూడ ...ంది. వాడి మనోబాధకు చాలా జాలిపడింది. "రామూ, ...ఏకదూ, ఏడవకు, ఏడవకు. ఒక దారిదొరికిందిలే. భయ ...ు. శనివారంనాడు గంటయ్య ఇక్కడ ఉండడు లే. దొరగారి ...గ్గరనుంచి మనిషివచ్చాడు. శనివారంనాడు అక్కడికి వెళ్లవలసి

నట్టుంది. సోమవారందాకా అక్కడ ఏదోపని ఉన్నట్టు ఇందాక ఎవరితోనో చెప్పుతూ ఉండినాడు. అదేం పనో, కొంపలుముంచేపని, ఏదైతే ఏమిలే, శనివారంనాడు నీవు నిశ్చింతగా సర్కస్సుకు పోవచ్చు, గంటయ్యకు చచ్చినా తెలియదు లే!" అంటూ ముస లమ్మ రాముని తల నిమురుతూ బుజ్జగించింది.

ఎప్పుడెప్పుడు వస్తుందా అని రాముడు ఎదురుచూస్తూ, వచ్చిన ఆ శనివారం చివరకు రానేవచ్చింది. వాడు కృష్ణునితో పాటు కాలిబాట వెంట నడిచిపోతున్నాడు. నేలమీద అడుగులు పడుతున్నట్లే లేదు వానికి! కాలిసంకెళ్లు ఫెళ్ళున తెగిపోయినట్లూ, ఎన్నడూ ఎరగని స్వాతంత్ర్యం లభించినట్లూ వానికి మనస్సులో మహానందం. ఇలా నడుస్తూ పోతే లాభంలేదు, రెక్కలుకట్టుకొని ఎగిరిపోవాలన్న ఆశపుట్టింది. లేక లేక లభించిన విడుదలకదూ మరి! అది వానిని ఒళ్ళుమరిచిపోయేటట్లు చేసింది. తొట్టతొలిసా రిగా వాడు పట్నం పోతున్నాడు. అందులోనూ తొట్టతొలిసారిగా ఒక సర్కస్సు చూడడానికి, ఆ సర్కస్సయినా, సాధారణ సర్కస్సా? కాదు, సయానా మృగాలే నడిపే ఒక విచిత్రసర్కస్సు!

ఇద్దరూ కాలిబాటనుంచి రోడ్డున పడ్డారు. ఆ రోడ్డువెంట నాలుగుమైళ్ళు నడిచారు. అయినా, వారికి కించిత్తుకూడ అలసట తోచనేలేదు. సర్కస్సు చూడడానికి కదూ వారు పోతున్నది! ఇంకెందుకు అలసట తోస్తుంది? దూరంగా బ్యాండు శబ్దం విని పించింది.

"అదిగదిగో, అదే, సర్కస్సు బ్యాండు," అని కృష్ణుడు రామునికి హెచ్చరించాడు. ఆ శబ్దం చెవినిబడేసరికి రామునికి ఉన్నట్టుండి ఒళ్లంతా విద్యుత్తు ప్రసరించినట్లయింది. ఇద్దరూ ఇంకా గబగబా నడక సాగించారు.

అదిగో! ఇంక కొంచెందూరంలోనే ఉంది సర్కస్సు డేరా! ఇద్దరూ పరుగుతీశారు. డేరాముందుకు చేరుకొన్నారు. రాముడు

గబగబా లోపలికి పోబోయాడు. వల్లకాలేదు. తలుపు మూసివుంది. "రామూ, ఆగు, ఆగు. అలా జోరుగా జొరబడితే ఎలా? టికెట్టు కొనవద్దూ? ఒక్కొక్క టికెట్టు నాలుగణాలు," అని కృష్ణుడు చెప్పాడు. ఆ మాటలు వినేసరికి రాముడు నిలువునా నీళ్ళుగారి పోయాడు. మిలమిల మెరిసిన ముఖం ఉన్నట్టుండి వాడిపోయింది. టికెట్టుకు నాలుగణాలే! అమ్మయ్యో, అంత మొత్తం వాడు ఎక్కడ నుంచి తెస్తాడు? అసలు నాలుగణాలబిళ్ల వాడు కంటగూడ చూచి మెరుగడే! మరి ఇప్పుడేం చేస్తాడు? మిణకరిస్తూ నిలుచున్నాడు. వాడి నిరుత్సాహం చూసేసరికి కృష్ణునికి అయ్యో పాపమనిపించింది. "రామూ, దిగులుపడకు. నేను నీకు టికెట్టు కొనిపెడతానులే!" అన్నాడు.

రెండున్నరగంటలు అతి వేగంగా గడచిపోయాయి. అంత పొద్దుపోయిన సంగతి రామునికి తెలియనేలేదు. ఏనుగు, సింహం, పులులు, ఒంటెలు, ఎలుగులు, గుఱ్ఱాలు, కోతులు, నక్కలూ— ఒకటొకటీ ఎటువంటి ఎటువంటి అద్భుతవిద్యలు చేసిచూపించాయని!...

సర్కస్సు ముగిసింది. రాముని ముఖం సురిగిపోయింది. సర్కస్సు ముగియకుండానే ఉండి ఉంటే...!

కృష్ణుడూ, రాముడూ ఇంటిముఖం పట్టారు. కృష్ణుడు ఏమేమో చెప్పుకు పోతున్నాడు. అవి ఏవీ రాముని చెవిలో పడడమే లేదు. కాళ్ళు తమంతట తామే నడిచిపోతున్నాయి; మనస్సేమో సర్కస్సులోనే నిలిచిపోయింది.

ఏమనిపించిందో ఏమోకాని "కృష్ణా, నేనూ సర్కస్సులో చేరిపోతాను." అన్నాడు తటాలున రాముడు.

కృష్ణునికి ఫక్కున నవ్వువచ్చింది. "ఉండి ఉండి బలే ఆశ పడ్డావే! ఇది మృగాల సర్కస్సుగాని, మనుషుల సర్కస్సుగాదు

తెలుసా? నీవేమో మనిషివి; మృగానివి కావు. మృగాలు నిన్ను చేర్చుకోవు,'' అన్నాడు.

'నేనూ ఒకమృగమయిఉంటే...' అంటూ రాముడు గొంతెమ్మ కోరిక కోరాడు. పాపం! ఎంత అమాయికుడు!

కాలిబాట రాగానే కృష్ణుడు తనదారిన తాను చీలి పోయాడు. రాముడు ఒంటరిగాడై పోయినాడు.

అదిగో! దూరంగా ఇల్లు! ఎదురుగ్గా వెన్నెల మసకమసకగా కాస్తున్నది! ఏదీకూడ స్పష్టంగా కనబడడం లేదు. రాముడు వేగంగా నడిచాడు. ఇంటి వాకిట్లో ఎవరో కూర్చున్నట్లు కనబడింది.

''నా కర్మంకాలి అతడు గంటయ్యే అయి ఉంటాడా? ఉండడు ఉండడు. అతడెక్కడికో వెళ్ళిపోయాడుగా! రెండురోజులకు గాని రాడుగా! కాబట్టి ఆ కూర్చున్నది ముసలమ్మే అయిఉంటుంది. సర్కస్సును గురించి ఆ ముసలిదానికి వివరంగా వర్ణించి చెప్పాలి. కాని ఆ ముసలిది నమ్ముతుందా అని! ఎలాగైనాసరే నమ్మించాలి. 'నేను నా కండ్లారా చూచానవ్వా!' అని చెప్పాలి,'' అని ఊహా లోకంలో ఊహించుకొంటూ, 'అవ్వా, అవ్వా,' అని అరచుకొంటూ ఎంతో ఉత్సాహంతో ఇంటివైపు పరుగుతీశాడు.

''ఏమిటేమిటి, భడవా రాస్కల్, ముసలిదానికీ నీకూ అంతస్నేహమా?''—ఈహుంకారంవినంగానే రాముడు గడగడ లాడిపోయాడు. అయ్యయ్యో! ఎంతపొరపాటుపడ్డాను! ఇంటి వాకిట్లో కూరుచ్చున్నది గంటయ్యగాని ముసలిది కాదన్నమాట. అయ్యయ్యో వీడిక్కడ దాపురించాడే! ఇప్పుడేందారి? రాముడు గడగడ లాడిపోయాడు.

''ఒరే! నువ్వు సర్కస్సు చూడడానికి పోయావుకదూ!'' అని అడిగాడు గంటయ్య.

మనుష్యులు చచ్చిపోతే యమలోకానికి పోతారు. యముడు వారివారి నేరాలను విచారణచేస్తాడు. పిమ్మట నిప్పులోతోసి మాడు

స్తాడు; సలసలకాగే నూనెలో వేసి వేగిస్తాడు; ఒళ్లంతా మేకులు కొట్టిస్తాడు. ఈ కథలన్నీ ఎవరో రామునికి చెప్పిపెట్టారు. ఇతగాడు గంటయ్యా, లేక ఆ యముడా? ఒకవేళ గంటయ్యా, యముడూ ఒక్కరేనా? రాము కడుపు భగ్గున మండిపోయింది.

"వరాండాలోకి రారా!" అని హుంకరించాడు గంటయ్య. పాపం! రామునికళ్ళు రెండూ నాలుగుదిక్కులకూ నాలుగుసార్లు ప్రసరించాయి—ఇంకెందుకు? సహాయమేమైనా లభిస్తుందేమో అనే! "ఒరేయ్! కాలిబాటకవతల కాలుపెట్టగూడదని నేను చెప్పానా, లేదా రా? అయినా పోయావుకదూ, పట్నంచూడడానికి? అందులోనూ ముఖ్యంగా ఆ సర్కస్సు చూడడానికి? అంటే, నామాటలకు మదింపే లేదన్నమాట! అంతేగదరా!" గంటయ్య కళ్లలో నిప్పురవ్వలు మెరిశాయి.

రాముడు బదులు చెప్పలేదు. గడగడ వణకిపోతూ అలాగే నిలుచున్నాడు. గంటయ్య గభాలున గదిలోకి పోయాడు. మళ్లీ వెంటనే తిరిగి వచ్చాడు—ఒక దుడ్డుకఱ్ఱతో. ఆ దుడ్డుకఱ్ఱనుచూచి రాముడు వణికిపోయాడు. "నన్ను ఏమారుద్దామని చూచావుకదూ! మరి రెండురోజులకుగాని రాననుకొన్నావు. చివరకు నీవే ఏమారి పోయావు, చూచావా? అక్కడ నాపని త్వరగా ముగిసిపోయింది. వెంటనే వచ్చేశాను. అదిగూడ మంచికే అయింది. వెంటనే వచ్చేశాను కాబట్టే నీ పచ్చి దొంగతనం పట్టుకోగలిగాను. లేకుంటేనా, నీవింకా ఇలాగే నన్ను ఏమారుస్తూ ఉండిఉందువు. కదరా? ఓరి కృతఘ్నుడా! ఇదిగో పట్టు.



"అంటూ గోలచేస్తూనే గంటయ్య రాముడి తలమీద దుడ్డుకఱ్ఱ గట్టిగా ప్రయోగించాడు.

ఆ కేకలూ అఘోరింపులూ విని ముసలమ్మ పరుగు పరుగున వచ్చింది. గంటయ్య చెయ్యి అలాగ్గా పట్టుకొంది. "గంటయ్యా, ఈ విషయంలో రాముడిదేం తప్పులేదు! తప్పంతా నాదే. వాణ్ణి సర్కస్సుకు పొమ్మని నేనే చెప్పాను. వాడికి విధించే దండనలన్నీ నాకు వెయ్యి. నేను పడతాను. నీదుడ్డుకఱ్ఱ, వానిమీద ఎందుకు ప్రయోగిస్తావు? ఇదిగో నాతలమీద ప్రయోగించు. పాపం! పరాయి అమ్మకన్న ఆ పిల్లవాణ్ణిమాత్రం కొట్టకు!" అని ముసలమ్మ ఏడుస్తూ ఏడుస్తూనే బతిమాలుకొంది.

గంటయ్య బదులేం చెప్పలేదు. అతగాడు ముసలిదానిని ఒక తన్ను తన్నాడు. ఆ తన్నుతో ఆవిడ పోయిపోయి అల్లంతదూరాన పడింది.



మరుక్షణంలో దుడ్డుకఱ్ఱ కిందికి దిగజారిపోయింది. రాముడు అయ్యో అని అలపరించాడు. దాంతోపాటు మైకం కమ్మి కిందికి పడిపోయాడు.

## 5

దేశంలోని మృగజాతియందంతటా ఒకటే కలవరం.

ఎవరినోట విన్నా సర్కస్సును గురించిన సంభాషణే; సర్కస్సును గురించిన జ్ఞాపకాలే! "సర్కస్సులో చేరితీరాలి. ఆ ఆశ నెరవేరినా, లేదా? లేకుంటే బతికిఉండి ఏంలాభం?"

"సర్కస్సుకు పంపుకొన్న దరఖాస్తు ఏమైంది? జవాబేమైనా వచ్చిందా?"—దేశంలోని మృగాలు రెండు ఎక్కడైనా సంధిస్తే, మొదటి ప్రశ్న ఇదే! "ఓ, జవాబు వచ్చింది. అక్కడికి రమ్మని వ్రాశారు," అని ఒక మృగం చెప్పిందో...? తక్కిన మృగాలన్నిటికీ చాలా కష్టంగా ఉంటుంది. తనకు లభించకుండా తక్కినవారికి లభించడమా? ఎవరికిమాత్రం ఇది సంతోషమిస్తుంది? "జవాబేమీ రాలేదు," అంటే సరి, అబ్బబ్బా! ఆమాట వినడంలో అందరికీ ఎంత తృప్తిగా ఉంటుందో!

దీనికంతా కారణం ఏమో తెలుసా? మృగాల సర్కస్సు చేసిన ప్రకటనే!

సర్కస్సు తలచ్చేరి పట్నంనుంచి కళ్ళికోటకు వచ్చింది. అక్కడ నెల్లాళ్ళు నడిచింది. పిమ్మట కళ్ళికోటనుంచి పాలఘాటుకు వచ్చింది. అక్కడా నెల దినాలు నడిచింది. అటుతర్వాత పాలఘాటు నుంచి ఎర్నాకుళానికి పోయింది. అక్కడకూడ నెలరోజులు నడిచింది. ఇప్పుడు ఎర్నాకుళంనుంచి తిరుచూరుకు వచ్చింది.

తిమ్మన్నా, అతని సహచరులూ అటు సర్కసు విద్యల్లోనూ పాల్గొవలసివచ్చేది; ఇటు తక్కిన పనులుకూడ అన్నీ తామే చేయవలసివచ్చేది. డేరా వేయడం, మళ్ళీ నెల్లాళ్లకు దానిని తీయడం,

ఒకచోటునుంచి ఇంకొకచోటికి సామాన్లు చేరవేయడం, తిండి తీర్థా లకు ఏర్పాట్లుచేయడం—ఇలా ఎన్నెన్నో పనులు! విశ్రాంతి అంటూ లేనేలేదు. అందరూ అలసిపోయ్యారు.

"అన్నిటికన్నా పెద్ద ఏనుగును నేనేకదూ!" అని గజేంద్రుడు యథాప్రకారంగా పదేపదే అడుగుతూండేవాడు. తక్కిన మృగాలుకూడ "అవును, అవును" అంటూ తల అడించేవి. ఇదంతా అతగాణ్ణి తృప్తిపరచడానికే! తాను అలసిపోయినట్లు గజేంద్రు డెప్పుడూ చూపుకొనేవాడు కాదు. చూపుకొంటే, బలశాలి అనే పట్టానికి భంగం రాదూమరి!

ఇక సింగన్నసంగతి. అతగాడికి ఇప్పుడు కోపం ఎక్కువై పోయింది. అలా కోపం వచ్చినప్పుడల్లా "గోవిందరావు మాష్టారు చెప్పింది అప్పుడే మరచిపోయావా? ఊఁ. ఎంచు నూరువరకూ. కానీ, త్వరగా!" అని చిన్నతిమ్మన్న జ్ఞాపకపరుస్తూ ఉండేవాడు. ముందంతా పదిపండెండు లెక్కపెట్టేసరికల్లా కోపం చల్లారిపోయేది. ఇప్పుడో, నలభై నలభైఐదువరకూ లెక్కపెట్టవలసి వస్తున్నది!

ఎలుగులు అదివరకు బాగా కండ పట్టి లావులావుగా ఉండేవి. కాని, ఇప్పుడు కండలన్నీ కరిగి సన్నబడిపోయాయి.

"నీ పండ్లు ముందుకంటే ముందుకు పొడుచుకొనివచ్చాయేమిటి?" అని చల్లయ్య పల్లయ్యను అడుగుతాడు. "అది సరే కాని, నీముఖం వాపు ఎక్కువయింది? లేక జలదోషం జాస్తి అయిందా? చెప్పు," అని పల్లయ్యచల్లయ్యకు ఎదురుప్రశ్న వేస్తాడు.

జంబూ తోకకుచ్చు కాస్త పలచబడిపోయింది. వెంట్రుకలు చాలామటుకు రాలిపోయాయి. అతని మందహాసం ముందుకంటే ఇప్పుడు అతని ముఖానికి వికారం కలిగిస్తున్నది.

చిన్నతిమ్మన్న ముందువలె తమాషాలు చేయడమేలేదు. వెనుకటి ఆ చురుదనమూ, ఆ ఉత్సాహమూ కూడ ఇప్పుడు లేవు.

గుఱ్ఱాలూ, ఒంటెలూ ఇదివరకు హాకీ ఆడేటప్పుడు ఒక గుక్కెడు నీళ్ళుకూడ తాగేవికావు. ఇప్పుడో, పదేపదే నీళ్లు తాగవలసి వస్తున్నది.

"సర్కసువిద్యలు చూపించేటందుకు సాధనచేసిన పాత మృగాలూ, పనిపాటులుచేయడానికి కొత్తమృగాలూ వేరువేరుగా ఉంటే మంచిది. కొత్తమృగాలకు కొత్త కొత్త విద్యలు నేర్పవచ్చు. అప్పుడు సర్కస్సు ఇంకా బాగా రాణిస్తుంది," అని తిమ్మన్న అనుకొన్నాడు.

"మా సర్కసుకంపెనీలో పనిచేయుటకు కొత్తజంతువులు కావలెను!" అని ప్రకటన తగిలించిందే తడవు—దరఖాస్తులు కుప్పలు కుప్పలుగా వచ్చిపడ్డాయి. దేశంలోని మృగాల ఉబలాటం చూచారు జనం. మరి వాటిని నిషేధించకపోతే ఎలా? అన్నీ తెగించి వెళ్లిపోతే ఇక నిత్యకృత్యాలు ఎలా సాగుతాయి?

కొందరు పనికట్టుకొని తమతమ కుక్కలను గొలుసులతోకట్టి పశువులకు ఇంకా బలమైన పలుపులు తగిలించారు. సళ్లియున పాతపలుపులు తెంచుకొని తమ పశువులు ఎక్కడ పారిపోతాయో అని వారి భయం. చిలుకలకు మరింత గట్టిగాఉండే పంజరాలు కొన్న మహానుభావులూ ఉన్నారు. ఇన్నాళ్లూ అలవాటు లేకపోతే మాత్రమేమిటి పిల్లులనుకూడ, పారిపోకుండా, కట్టిపెట్టి ఉంచితే మంచిదికదా. అని, కొందరదీ ఆరంభించారు. కోళ్లనూ బాతులనూ చాలామటుకు ఎవరూ ఎక్కువగా బయటికి విడవడమే లేదు. ఒకవేళ విడిచినా, నలుగురైదుగురు వాటివెంట దుడ్డుకఱ్ఱలు పట్టుకొని ఎప్పుడూ కావలి కాస్తూనే ఉంటారు. తమ



కళ్లలో మన్నుకొట్టి ఇవి తప్పించుకొనిపోయి సర్కసుల గతి? అందు కెడమివ్వవచ్చా? చాలా మృగాలకు ఈ ప్రతిబం చాలా కంటకంగా ఉన్నాయి. కాని, కొన్నిమృగాలుమాత్ర తెలివి చూపించి పని సాధించుకొన్నాయి. దారిలేనిచోట దారి పెట్టాయి. ఎవరికీ తెలీకుండా దరఖాస్తులుపంపి జవాబులకోసం కాచుకుకూర్చున్నాయి. అలా కాచుకుకూర్చున్న చాలావాటిలో కొన్నింటికిమాత్రమే జవాబులు వచ్చాయి. ఒక తేదీ పేర్కొని, ఆ తేదీనాడు తిరుచూరులోని సర్కసు డేరాకు వచ్చి మేనేజరును కలుసుకోవలసిందిగా ఆ జవాబుల్లో ఉంది. జవాబులు వచ్చికూడ కొన్ని మృగాలు వెళ్లలేకపోయాయి. వాటి యెత్తులు చివరినిమిషంలో వాటి యజమానులు కనిపెట్టివేశారు అదృష్టశాలులైన కొన్ని మృగాలుమాత్రమే గడువు తేదీకి సరిగా డేరాకు వెళ్లగలిగాయి.

లోపల ఒక చిన్నడేరాలో ఎన్నికలసంఘం సమావేశమయింది. ఆ సంఘానికి అధ్యక్షుడు తిమ్మన్న. చిన్నతిమ్మన్న, గజేంద్రుడు, సింగన్న, జంబూలు సభ్యులు. వీరందరూ దరఖాస్తుదారులను ఒక్కొక్కరినీ లోపలికి పిలిపించి పరీక్షచేశారు. చాలా మందికి సర్కసుపనిలో అనుభవమేమీ లేదు. అనుభవం లేకపోతే పోయింది, నేర్పయినా ఉన్నదా అంటే, అదీ కనబడలేదు. రెండు మూడు ప్రశ్నలు వేసేసరికే ఆసంగతి తేలిపోయింది. మరి వాటిని దండుగకు ఎందుకు రమ్మన్నట్టు? ఎందుకా? లేని అర్హతలన్నీ



తమ దరఖాస్తుల్లో తప్పుగా పేర్కొన్నందువల్ల.
...ా నిలబడి మాట్లాడవలసి వచ్చేసరికి ఆ బండారం బయట
వాటిని కంపెనీలో చేర్చుకోవడానికి సాధ్యపడలేదు. పాపం!
...కెంత కష్టంగా ఉంటుంది! అవి కళ్లనీళ్ళు పెట్టుకొన్నాయి.
దయచేసినన్ను ఎలాగైనా చేర్చుకోండి. త్వరలోనే నేను అన్ని
విద్యలూ కష్టపడి నేర్చుకొంటాను. మీకు పుణ్యముంటుంది. నన్ను
వెనుకకు పంపకండి!'' అంటూ చాలా మృగాలు మొరపెట్టు
కొన్నాయి. ఏమిటిచేయడం? వేరు దారిలేదు.

ఎన్నుకొన్నవాటిలో ఒక కుక్క గూడ ఉంది. దానిపేరు వెల్లయ్యా. దానిని చూడంగానే ఎందుకోగాని ఎన్నికలసంఘంవారికి సదభిప్రాయం ఏర్పడింది. వారు దానిని అనేకప్రశ్నలు అడిగారు. అది అన్నిటికీ సరియైన సమాధానాలిచ్చింది. ''ఏదైనా విద్య తెలిసివుంటే చేసిచూపించు,'' అని సింగన్న అడిగాడు. వెల్లయ్యా కొంచెం కూడ జంకలేదు.

అతగాడు నేలమీద తలకిందులుగా నిలుచున్నాడు. నాలుగు కాళ్ళనూ బాగాచాచాడు. ఆకాళ్లను ఆడిస్తూ ఆడిస్తూ చిత్రవిచిత్రమైన తమాషాలుచేసి చూపించాడు. ఆ వేడుకకు అబ్బురపడి, తిమ్మన్నా, అతని సహచరులూ అలాగే నిర్ఘాంతపోయారు. ''మనమూ ఆటగాళ్లమే! కాని ఇటువంటి విద్య మనకు తెలియనే తెలియదే! మనుష్యులుగూడ ఇటువంటివిద్య ఎన్నడూ చూపించ...నే!'' అని అందరూ ఆశ్చర్యపోయారు. తర్వాత ''వెల్లయ్యా, ...ి నేర్పిందెవరు?'' అని గజేంద్రుడడిగాడు.

''నా యజమాని రాముడు అనే అబ్బాయి,'' వెల్లయ్యా బదులిచ్చాడు.

...బ్బాయా? అతడు సర్కసు విద్యలుగూడ నేర్పుతాడా ...దులోనూ ఇటువంటి విద్య! అతడెక్కడ ఉన్నాడు?'' మళ్లీ అడిగాడు. ''మీరు కొన్నాళ్లకిందట సర్కసు ...రూ, ఆ తలచ్చేరికి ఏడెనిమిదిమైళ్లదూరంలో ఒక

ఊరుఉంది. అక్కడ ఉంటాడు రాముడు. అతడే ఒకసారినన్ను పిలిచి 'వెల్లయ్యా, సర్కసులో చేరాలని నాకు చాలా ఆశగాఉంది. కాని, నా ఆశ నెరవేరదు. గంటయ్య ఉన్నంతకాలం నేను సర్కసులో చేరడం సాధ్యమయ్యేపనికాదు. కాని ఆ మృగాల సర్కస్సులో నన్ను చేర్చుకోరంట. ఏమంటే, నేను మనిషినిగదూ! కాబట్టి నీవు పో. నేను నీకు నేర్పిన విద్యలుచేసి చూపించు. వారు తప్పకుండా నిన్ను చేర్చుకొంటారు,'' అని చెప్పి ఆయనే నన్ను ఇక్కడికి పంపాడు,'' అంటూ వెల్లయ్య జవాబు చెప్పాడు.

కొత్తగా చేరినవారికి తిమ్మన్న కొత్తవిద్యలు నేర్పాడు. గజేంద్రుడు, సింగన్న, జంభూ మొదలైనవారు తమకు తమకు తెలిసిన విద్యలు కూడా నేర్పారు.

సర్కసుచూడవచ్చే పిల్లలసంఖ్య పెరుగుతూనే వస్తున్నది. పెద్దవాళ్లుకూడా సర్కసుచూడాలనే తమ ఆశ అణచుకోలేక పోతున్నారు. పోనీ, సర్కసు చూడడం మాత్రానికైనా వారు పిల్లలుగా మారిపోతే...? అది ఎలా వీలుపడుతుంది? పిల్లలుగా మారాలంటే, రూపంలో చిన్నవాళ్లయిపోవాలి. చిన్నవాళ్ళు కావాలంటే శరీరాన్ని చిన్నగా కోసివేయ్యాల్సిందే. అది సాధ్యం అయ్యే పనా?

అయితే, పెద్దల్లో కొందరు పొట్టివాళ్లు ఉంటారుగదూ! అటువంటివారు కొందరు గడ్డం మీసాలు తీసివేసి చిన్నపిల్లల్లాగు వేషం వేసుకొని బహు చమత్కారంగా లోపలికి దూరి పిల్లల్లో పిల్లలుగా కలిసి పోయికూర్చున్నారు. అయినా అటువంటివారిలో చాలమందిని సర్కసుమృగాలు కనిపెట్టివేశాయి. మెడబట్టి బయటికి గెంటివేశాయి. మృగాల కంటబడకుండా కొందరు గుంపులో గోవిందా అని గుట్టుగా కూర్చొని ఉండినారు. పక్కనకూర్చున్న పిల్లలకు సందేహంతోచింది. కేకలువేసినప్పుడు వారి కంఠధ్వనులనుబట్టి అవి పెద్దలగొంతుకలని ఆపక్కపిల్లలు గ్రహించారు. వెంటనే ఆ దొంగతనం బయటపెడుతూ అరిచారు. సర్కసుమృగాలు వెంటనే వచ్చి వారికి గల్లా ఇచ్చాయి.

సర్కసు చూచివచ్చిన పిల్లలు దానిని గురించే మాట్లాడు కొంటున్నారు. తాము చూడలేనిదానిని వీరు చూచివచ్చారే! ఇది శుద్ధ అన్యాయంకదూ! పెద్దవాళ్లకు ఒకటేమంట! చిన్నవాళ్లను సర్కసుకు పోనీకుండా వారొక యుక్తిచేశారు. "కాళప్పసర్కసు త్వరలోనే వస్తున్నది. సర్కస్సు చూడాలంటే కాళప్ప సర్కస్సే చూడాలి. మేము దానికే పోదలచాము. మృగాల సర్కస్సుకు మేము పోనేపోము," అని డబ్బావాయించడం మొదలుపెట్టారు. కాని, పిల్లలను ఏమార్చడం సాధ్యమేనా? వారిపాటికి వారు యథా ప్రకారంగా మృగాల సర్కస్సుకే పోయివస్తున్నారు.

లోపల ఆశను ఎవరైనా ఎన్నాళ్లని అణచిపెట్టుకొని ఉండ గలరు? పెద్దవాళ్ళు తమ ఆశను బాహాటంగా బయటికి చెప్పుకో వడం ప్రారంభించారు. అంతేనా? సభలు జరిపారు. సమావేశాలపై సమావేశాలు నడిపి అన్నిట్లోనూ దీన్నిగురించే తీర్మానంచేశారు. "మృగాల సర్కసు చూడడానికి పెద్దలనుకూడ అనుమతించాలి!" అన్నదే ఆ తీర్మానం సారాంశం. అంతతోనే ఆగలేదు. ఆరుగురు పెద్దలతో ఒకరాయబారవర్గం ఏర్పాటుచేశారు. ఆరాయబారవర్గం వారు వెళ్లి, తిమ్మన్నను కలుసుకొన్నారు. తమకోరికను తెలుపు కొన్నారు. "టికెట్లరుసుములు ఎంతైనా పెట్టండి. సంతోషంగా ఇచ్చుకొంటాము. ఎలాగైనా సర్కస్సు చూడడానికి మమ్మల్ని కూడ అనుమతించండి. ఇప్పుడున్న ఆంక్షను తీసివేయండి," అని ప్రాథేయపూర్వకంగా మొరపెట్టుకొన్నారు.

తిమ్మన్న తనసహచరులతో సంప్రతించాడు. "వారినికూడ అనుమతించాలి. అదేమంచిదని నాకు తోస్తున్న" దంటూ చిన్న తిమ్మన్న చెప్పాడు.

"ఇప్పుడు మనడేరాకూడ పెద్దదయింది. పెద్దవారినికూడ రానివ్వవచ్చు. కావలసినంతచోటు ఉంటుంది," అని గజేంద్రు డన్నాడు.

వారిమాటలు విన్నాక సింగన్న "అయితే సరే, చూద్దాం. కాని, ఒకషరతు. పిల్లలుమాత్రమే ముందువైపు కూర్చోవాలి. పెద్దలందరు వెనుకవైపు కూర్చోవాల్సిందే," అని ఖండితంగా చెప్పి వేశాడు.

"పెద్దలనుంచి రెట్టింపుఛార్జీలు వసూలుచెయ్యాలి. అప్పుడే మనకు బాగా డబ్బువస్తుంది," అని జంబూ అందుకొన్నాడు. తిమ్మన్న ఇదివిని "జంబూ, నీకెప్పుడూ డబ్బుమీదనేగురి కదూ?" అని ఒక్కనవ్వు నవ్వాడు.

"డబ్బంటే అంత అలక్ష్యం కూడదు. ఒక్కటి గట్టిగా తెలుసుకో. డబ్బుంటేనే ఏపనైనా సాగేది! కాసులేనివాడు కట్టెతో సమానం తెలుసా?" అని జంబూ ఘాటుగా జవాబిచ్చాడు.

తిమ్మన్న అందరి అభిప్రాయాలనూ ఆమోదించాడు. అది మొదలుకొని సర్కస్సుకు జనం విరగబడి రావడం ప్రారంభించారు. రాబడికూడ బాగా పెరిగింది. డబ్బు భద్రంగా దాచుకోవడానికి ఒక ఇనపపెట్టెకూడ కొన్నారు.

తిరుచూరిలో ఉండిన సర్కస్సు కొట్టాయానికి వచ్చింది.

"ఒక విషయం గమనించాలి. పెట్టెనిండా డబ్బున్నది. మనుషుల్లో బలే దొంగలుంటారు. కాస్త కన్నుమరుగై తేసరి, తస్కరించుకొని పోతారు. తర్వాత మనగతేంకాను? అదికాక, జమా ఖర్చులు జాగ్రత్తగా వ్రాసిపెట్టాలి. మనలో ఎవరైనా ఈ బాధ్యత వహించాలి. కావలిస్తే, నేనే ఆ బాధ్యతవహిస్తాను—మీకు గనక సర్వాత్మనా సమ్మతమైతే!" అని జంబూ తిమ్మన్నతో అన్నాడు.

చిన్న తిమ్మన్నకు ఇది ఇష్టంలేదు. అయితే అది బయటకు చెప్పకుండా వేరేవిధంగా వెల్లడించాడు. "భాయిసాబ్! డబ్బు బ్యాంకులో వేద్దాం, అదే మంచిది. వేయవలసి...డు వేస్తూ వచ్చు; తీయవలసినప్పుడు తీస్తూ ఉండవచ్చు. భయంకూడ ఉండదు," అని నయంగా చెప్పా

డబ్బుపెట్టె తీసుకొని తిమ్మన్న బ్యాంకుకు వెళ్లాడు. బ్యాంకు మేనేజరు వర్గీస్ తిమ్మన్నను చూడంగానే చాలా సంతోషించాడు. ఆ వచ్చింది ఎవరు మరి! మృగాల సర్కసు మేనేజరుకదూ! బ్యాంకు మేనేజరు వెంటనే అకౌంటెంటు చెరియన్‌ను పిలిచాడు. ఇద్దరూ కలిపి తిమ్మన్నకు స్వాగత సత్కారాలు చేశారు. తక్కిన బ్యాంకు సిబ్బంది అందరూకూడ పనులన్నీ ఎక్కడివక్కడ మానేసివచ్చి తిమ్మన్న చుట్టూ మూగారు.

"తిమ్మన్నగారూ, మీరాక మాకు ఎంతో ఆనందదాయకంగా ఉన్నది. మీరు బ్యాంకు చూడడానికిగదూ వచ్చారు! రండి, అన్ని శాఖలూ చూపుతాను," అని మేనేజర్ వర్గీస్ ఆహ్వానించారు.

"నేను వచ్చింది... లేదు... వేరేమీకాదు. చేతినిండా డబ్బున్నది. ఈ డబ్బు మీ బ్యాంకులో వెయ్యాలి. కావలసినప్పుడు తీసుకోవచ్చుగా!" అని తిమ్మన్న తానువచ్చిన అసలుసంగతి బయటపెట్టాడు. అది విన్న మేనేజరు ముఖం కొంచెం మారిపోయింది.

"ఓహో! అదా విషయం?" అని ఆయన తలగోక్కుంటూ చెరియన్‌ను పిలిచాడు. ఇద్దరూ ఒకమూలకు వెళ్లారు. రహస్యంగా ఏదో మాట్లాడుకొన్నారు. వాళ్లేమి మాట్లాడుకొంటున్నదీ తిమ్మన్నకు తెలియదు. చెరియన్ మాటిమాటికీ తల ఆడిస్తూ ఉండడం మాత్రం తిమ్మన్న చూశాడు.

కొంచెంసేపయిన తర్వాత బ్యాంకు మేనేజరు సర్కస్సు మేనేజరువద్దకు వచ్చాడు. "తిమ్మన్నగారూ, దయయుంచి తప్పుగా
కోకండి. చెప్పడానికి నాకే కష్టంగా ఉన్నది. అయినా చెప్ప
ంకాని పని. డబ్బు విషయంలో మాకు మృగా
ళు," అని చావుకబురు చల్లగా చెప్పాడు.

తిమ్మన్నకు ఆశ్చర్యమయింది. "ఏమి సార్, తారే! మేము మా డబ్బు బ్యాంకులో వేయడానికి ఏ మృగాలు పెట్టుకొనిఉంటే నేం? డబ్బు డబ్బేకదా!" అన్నాడు

వర్గీస్ ఇంకొకసారి తలగోక్కున్నాడు. చెరియన్ వైపు ఒకసారి చూచాడు. చెరియన్ తల కుడిఎడమలుగా ఆడించాడు. "తప్పుగా ఎంచుకోకండి. మేము మీ సర్కస్సు చూచేవాళ్లం. ఎన్నిసార్లు చూచినా అది చాలనిపించడంలేదు. నేనూ, ఈ చెరియనూ, ఇక్కడ ఉన్నవాళ్లందరమూ మీ స్నేహం కోరేవాళ్ల మే. కాని, అది వేరేవిషయం. ఇది పక్కా వ్యాపారం. మృగాలతో మేము డబ్బువ్యవహారం పెట్టుకోవడంలేదు. అందుకు తగిన చట్ట నిబంధనలుకూడ లేవు. చెరియన్‌గారూ, మీరేమంటారు?" అని వర్గీస్ అడిగాడు.

చెరియన్ పైకీ కిందికీ తల ఆడించాడు.

చట్ట నిబంధనలు—అనేసరికి తిమ్మన్నకు పాతజ్ఞాపకం వచ్చింది. తమను ఇంటినుంచి వెళ్లగొట్టడానికి కాళప్పతోపాటు వచ్చాడే ఒక వకీలు——ఆ వకీలును తలచుకొన్నాడు తిమ్మన్న. ఆనాడు ఆ వకీలు ఇలాగే మృగాలకు ఆస్తిఉంచుకొనే హక్కు లేనేలేదన్నాడు. అందుకు చట్ట నిబంధనకూడ సమ్మతించదన్నాడు. ఈనాడు ఇదిగో ఈ వర్గీసుకూడ 'మృగాలు బ్యాంకులో డబ్బువేసుకోవడానికి వీలులే'దంటున్నాడు. బలేచట్టమే!

ఈ విషయమై ఇంకా ఏమేమో ముఖానసే అనివేయాలని తిమ్మన్న అనుకోనేమో అనుకొన్నాడు గాని, మళ్ళీ వెంటనే సర్దుకొన్నాడు. డబ్బుపెట్టె తీసుకొని బయలుదేరాడు. డేరాకు చేరుకోగానే, "జంబూ, ఇక ఈ బాధ్యత నీవే వహించాలి. తప్పదు," అన్నాడు.

అందుకోసమే జంబూ కాచుకు కూర్చున్నాడు. అతని ముఖంలో ఒక ముసిముసినవ్వు వెల్లివిరిసింది.

సు ముగియంగానే మృగాలన్నీ ఎక్కడివక్కడ పడి
యి. వాటికెలా తెలుస్తాయి జంబూ పడేపాట్లు! అతడు
లు ఒకటికి నాలుగుసార్లు లెక్కపెడతాడు. అతని ముఖంలో
త్సాహం తాండవిస్తుంది. ఆరోజు జమ ఎంత? ఖర్చు ఎంత? అది
అంతా సరిగ్గా లెక్కపుస్తకంలో వ్రాసిపెడతాడు. ఆ తర్వాతనే
అతని పడక.

జంబూ మాటిమాటికీ డబ్బులపెట్టె తెరుస్తాడు. తక్కిన
మృగాలకు చూపెడతాడు. అందులో నోట్లు కట్టలుకట్టలుగా
ఉంటాయి. రోజూవచ్చే చిల్లరడబ్బులను వెంట వెంటనే నోట్లుగా
మార్చిపెడుతూ ఉంటాడు, జంబూ. మృగాలు ఇస్తేనేం గాక,
నాణాలు మంచివిగా ఉంటే సరి పుచ్చుకోవడానికీ, మార్చుకోవడానికీ
మనుషులకేమీ ఆక్షేపణ లేదు.

"కంపెనీకి ఇంతడబ్బు రావడం ఎవరి సామర్థ్యంవల్లనోయ్?"
అని జంబూ ఒకటోనంబరు ఒంటెను రహస్యంగా అడిగాడు.

"మేనేజర్ తిమ్మన్న సామర్థ్యంవల్లనే," అని అతగాడు
జవాబు చెప్పాడు.

జంబూ స్నేహపూర్వకంగా అతని వీపుతట్టాడు. "అరే బడుద్ధాయ్!
అది అంతా నా సామర్థ్యంవల్లనే నోయ్! నీకు బుద్ధిఉంటేగదూ అది
బోధపడడానికి! నీవు వట్టి దద్దమ్మవని ఇదిగో ఇప్పుడే తెలుస్తున్నది,"
అని జంబూ ఒక్కనవ్వు నవ్వాడు.

తాను దద్దమ్మకానని ఒకటోనంబరు ఒంటెకు గట్టివిశ్వాసం.
జంబుచేతకూడ అది ఒప్పించాలని దానికి తాపత్రయం. అందుకని
వెంటనే అది "నేను నిజంగానే పొరపాటు పడ్డాను, బుద్ధిబుద్ధి! కం
పెనీ కలిమికి కారణం తిమ్మన్న కానేకాదు; జంబూయే," అని
ప్లేటు మార్చివేసింది.

జంబూకు పరమసంతోషమయింది. నవ్వుకొంటూ "నేను
ఇంకా ఏమో అనుకొన్నాను. నీవు వట్టి దద్దమ్మ వనుకొన్నాను.
కాని, నాది పొరపాటు. నీవు దద్దమ్మవు కావు. మహాబుద్ధిమంతుడివి.

ఇప్పుడు నాకు బాగా తెలిసిపోయింది. నేను లేకుంటే మృగసర్కస్సే లేదనుకో! తిమ్మన్న నామకార్థానికే మేనేజరు. నాకే ఇందులో ఎక్కువ బాధ్యతా, హక్కూను. నీవు ఇది మరెవరితోనైనా అనేవు సుమా!'' అన్నాడు.

హాకీ ఆటలో ఆరితేరినవి ఒంటెలు. ఇది ఒప్పుకోక తప్పదు. అయితే బుద్ధిమాత్రం కొంచెం మందం. ఇదికూడ తప్పక ఒప్పుకో వలసిందే. ఒకటోనంబరు ఒంటె చెప్పింది తక్కినవారు నమ్మారు. దానిని వారు గుఱ్ఱాలదగ్గర అన్నారు. ''వట్టిమాటలు మాట్లాడ కండి. అని అవి సవాలుచేశాయి. ఒంటెలు దానిని ఖాతరుచేయ లేదు. దాని ఫలితం? ఒంటెలకూ గుఱ్ఱాలకూ మధ్య లేనిపోని మనస్తాపం ఏర్పడిపోయింది. హాకీఆట వేగం ఎక్కువైపోయింది. ఇది వరకల్లా ఆటలో పోటీ, పోడిమి రెండూ ఉండేవి. ఇప్పుడు అందులో పోడిమి కనబడదు. పోటీమాత్రమే మిగిలింది. రాపుళ్లూ, తోపుళ్లూ, తాపులూ, కరపులూ అలవిమీరిపోయాయి.

ఒకనాడు జంబూ తిమ్మన్నదగ్గరకు వెళ్లి ''నాకు ఒక ముఖ్య మైన పనిఉంది. ఒకచోటికి పోవాలి. వారంరోజులు సెలవుకావాలి,'' అన్నాడు. తిమ్మన్న నివ్వెరపోయాడు. జంబూ లేనప్పుడు డబ్బు బాధ్యత పెట్టుకోవడానికి అక్కడ ఎవరూ లేరు.

''జంబూ, పైవారం పోగూడదూ? ఈలోపల లెక్కలు బాగా తెలిసినవాణ్ణి ఎవణ్ణయినా ఏర్పాటుచేద్దాం,'' అని తిమ్మన్న అన్నాడు. కాని, జంబూ పట్టుపట్టాడు. ''చాలా ముఖ్యమైనపని. ఇవాళే వెళ్లక తప్పదు. వారంతిరిగే సరికల్లా తప్పక తిరిగివస్తాను,'' అన్నాడు.

జంబూ బయలుదేరనే బయలుదేరాడు—ఒకమూట బుజా నికి తగిలించుకొని,

''భాయీ, ఏమిటామూట?'' అని అడిగాడు చిన్నతిమ్మన్న.

"ఏమయితే నీకేం? అడగడానికి నీవెవరు? అనవసరమైన పనుల్లో జోక్యం పెట్టుకోకు. మంచిదికాదు," అంటూ జంబూ విరుచుకుపడ్డాడు కోపంతో.

చిన్న తిమ్మన్న అనుమానం తీరలేదు. అది మనస్సులో అలాగే ఉండిపోయింది.

డబ్బు బాధ్యత పెట్టుకోవలసి వస్తుందా ఏమి? ఇదే అందరికీ పట్టుకొన్న భయం.

"ఏమిటిదారి?" అని మేనేజరు తిమ్మన్న అందరినీ అడిగాడు. అప్పుడు చిన్న తిమ్మన్న ఒక తమాషా చేశాడు.

ఇటువంటి అవకాశాన్ని వాడెప్పుడూ వృథాగా పోనివ్వడు.

"డబ్బు బాధ్యత గజేంద్రునికి కట్టబెడితే సరి!" అని అందరూ వినేటట్టుగానే అన్నాడు. వాడి నోటినుంచి ఆమాట వెలువడిందో లేదో—దబ్బుమని ఒక శబ్దం వినిపించింది. గజేంద్రుడు మూర్ఛ ముంచుకువచ్చి కిందపడిపోయాడు. తమాషా పోయి తంటా వచ్చి పడింది.



కొందరు విసనకఱ్ఱ తెచ్చి విసిరారు. కొందరు ముఖాన చన్నీళ్లు చిలకరించారు. ఎందరు ఎన్ని ఉపచారాలు చేసినా తర్వాత చాలాసేపటికి గాని ఆ మైకం వదలిపోలేదు. "డబ్బు-లెక్క-లు-" అని గజేంద్రుడు గాభరాగా ఏదేదో అంటూ గడగడలాడిపోయాడు. మళ్ళీ మూర్ఛవచ్చింది.

వెంటనే చిన్న తిమ్మన్న బయటికి పరుగెత్తాడు. కాసేపటి కల్లా ఒక మృగవైద్యుణ్ణి వెంటబెట్టుకొని వచ్చాడు.

డాక్టరు గజేంద్రుణ్ణి పరీక్ష చేశాడు. "ఇతడికి జబ్బేమీ లేదు. ఏదో భయపడిపోయాడు, అంతే. ఆభయం తీరిపోతే అంతా బాగై పోతుంది," అని చెప్పి వెళ్ళిపోయాడు.

చిన్న తిమ్మన్న అన్నయ్య చెవిలో ఏదో ఊదాడు. మరు క్షణంలోనే తిమ్మన్న "డబ్బు బాధ్యత గజేంద్రునికి వద్దు," అని తీర్మానంగా చెప్పాడు.

వెంటనే గజేంద్రుడు పైకిలేచాడు. చెవులూ, తోకా విసురు విసురున ఆడించాడు. తొండం పైకెత్తి, ఒక్క-సారి, మిగిలిన మైక మంతా వదలిపోయేటట్లు ఒళ్ళు విరుచుకొన్నాడు. కాళ్ళు విదిలిం చాడు. డబ్బూలెక్క-ల బాధ్యతనుంచి విడుదలపొందిన సంతోషం అతనిలో వెల్లివిరిసింది.



## 6

మృగాల సర్క-స్సును ఎలాగైనా పడగొట్టాలి. లేకుంటే, తన సర్క-స్సు మూసివేయవలసిందే అని కాళప్పకు ఖండితంగా బోధపడిపోయింది.

కాళప్ప సర్క-స్సుకూడ ఊరూరికీ వెళ్ళుతున్నది. కాళప్ప సర్క-స్సులో మృగాలే లేవు. మృగాల సర్క-సులో అన్నీ మృగాలే. అవిన్నీ ఎటువంటి మృగాలు! అద్భుతమైన విద్యలునేర్చిన మృగాలు,

మృగాల సర్కస్సు చూచినవారెవరూ కాళప్ప సర్కస్సు ఛాయల కైనా రావడంలేదు.

కాళప్ప సర్కస్సు కొన్నాళ్ళు మూసివేశారు. ఆటగాళ్ళకు పనేలేదు. 'పనిలేకపోతే మాత్రం జీతాలు ఇవ్వవద్దూ! ఇవ్వకపోతే వారు వేరే సర్కస్సులో చేరిపోతారు. ఆదాయంలేదు; ఖర్చు లెక్కువ. ఈవిధంగా ఆట్టేనాళ్ళు గడపడం సాధ్యంకాదు.

"అవును గాని, వకీలు పంతులూ, మృగాలసర్కస్సును పడ గొట్టడానికి ఏదైనా మార్గం ఉందా? చట్టప్రకారమైనా సరే, లేక..." అని కాళప్ప గట్టిగా అడిగాడు.

చట్టం పేరు వినంగానే వకీలు తుళ్ళిపడి లేచారు. అమ్మయ్యో! ఎంత ఉత్సాహం ఆయనకు! తాము చదివిన చట్టగ్రంథాలన్నీ లెక్కపెట్టడం ప్రారంభించారు. వాటిని లెక్కపెట్టడానికి ఆయనకు ఆట్టేసేపు పట్టలేదు. ఏమంటే, ఆయన చదివిందే బహుతక్కువ. చదవనివాటిని లెక్కపెట్టిఉంటే రోజంతా పట్టిఉండేది.

"మృగాల సర్కస్సు వెనుకడుగు; కాళప్ప సర్కస్సు ముందడుగు!"

"మృగాల సర్కస్సు మూసివేసే పరిస్థితి!"

ఇలాంటి శీర్షికలతో పత్రికల్లో కొన్ని వార్తలుకూడ వెలువడ్డాయి. 'సంపాదకునికి లేఖలు' అనే శీర్షిక క్రింద కొన్ని లేఖలుకూడ ప్రచురించారు. మృగాలసర్కసును గురించి నీలాపనిందలు వ్యాపింప జేయడం, దానిపైన ప్రజలకు అసహ్యం పుట్టించడం, ప్రజలు దానిని చూడకుండా చేయడం, కాళప్ప సర్కస్సుకు జనాన్ని తండోపతండాలుగా రప్పించడం—ఇవే ఆ వార్తలూ లేఖల ముఖ్యోద్దేశ్యంగా కనిపించింది. 'సర్కసు శ్రేయోభిలాషి', 'సత్యవాది', 'న్యాయ్యవాది' లాంటి మారుపేర్లతోనే అవి అన్నీ వెలువడడం గమనించదగిన విషయం. ఇన్ని వేరేవేరే పేర్లతో వచ్చినా అవి అన్నీ

వ్రాసినవాడు ఒక్కడేనన్న విషయం పాఠకులకు వాటిని చూడం గానే బోధపడిపోయింది. అయితే ఎవరా వ్రాసింది? అదే తెలియ లేదు.

'మృగాలసర్కస్సు' అనే పేరు చూడంగానే వాటిని సొంతం చదవడానికి పిల్లలు ఎగబడతారు. కాని, లోపల వారి అభిమాన సర్కస్సును గురించి దూషణలు కనిపిస్తాయి. వాటిని వారు ఎలా సహిస్తారు? వాటిని గురించి వారు పెద్దలవద్ద మొరపెట్టుకొన్నారు. పెద్దలుకూడ వాటిని సహించలేకపోయారు. ముందంటే ఆ పెద్దలకు గూడ మృగాలసర్కస్సుపై చాలాకోపం ఉండేది. ఆ సర్కస్సుకు పెద్దలను రానిచ్చేవారు కారుకదూ మరి! ఇప్పుడో పరిస్థితి మారి పోయింది. ఇప్పుడు పెద్దలుకూడ సర్కస్సుకు నిరభ్యంతరంగా వెళ్ల వచ్చు. అయితే ఆటంకమల్లా ఒక్కటేఒకటి. పెద్దలు వెనుకసీట్ల లోనే కూర్చోవాలి. అయినా, అసలు చూడకుండానే పోవడం కన్నా ఎక్కడో ఒకచోట కూర్చొనిఅయినా చూడగలగడం మెరుగుగాదూ! ఈనాడు వారికికూడ మృగాలసర్కస్సుపైన మంచి అభిమానం ఏర్పడింది. అందువల్ల ఆ సర్కస్సును గురించిన అభాం డాలు ప్రచురించే పత్రికలను వారు చదవడం మానివేశారు. అంత కన్నా వేరేంచేయగలరు? చింపి పారవేస్తారా? ఊహూం. వాటి నన్నిటినీ జాగ్రత్తగా భద్రపరుస్తారు. సాయంత్రం అందరూ బజారులో చేరుతారు. ఆ పత్రికల నన్నిటినీ నిప్పులోపడేసి కాలుస్తారు. ఇదీ నిత్యకార్యక్రమం.

ఒకనాడు బజారుగుండా పోతున్నాడు వకీలు. నడిబజారులో నిప్పు మండుతూ ఉండడం చూచాడు. దానిచుట్టూ జనం మూగి ఉన్నారు. "ఏమిట్రాసంగతి? ఏమిటీ నిప్పు?" అని వకీలు అందులో ఒకరిని పిలిచి అడిగాడు.

"మృగాల సర్కస్సును గురించిన అభాండాలు ప్రచురిస్తున్న పత్రికలను ఇలా తగలబెడుతున్నాం. ఆ అభాండాలు వ్రాసే ఆసామి ఎవరో తెలియకుండా ఉంది. తెలిస్తే వాణ్ణికూడ పట్టితెచ్చి

ఇందులో పడేసి భస్మంచేసివేస్తాం,'' అని జవాబిచ్చాడు ఆయన. వకీలు గడగడలాడుతూ అక్కడనుంచి ఎప్పుడు జారుకొన్నారో చల్లగా జారుకొన్నారు. నేరుగా కాళప్ప దగ్గరకువెళ్లి, ''చూచావా కాళప్పా! ఈ ప్రజల బుద్ధిలేనితనం! నేను వ్రాసిన సంపాదక లేఖలూ, వార్తలూ అన్నీ తగలబెడుతున్నారు. పోనీ, తగలబెడితే తగలబెట్టారు. సొంతం చదివి తగలబెట్టినా బాగుండిపోను. చదవకుండానే తగలబెడుతున్నారు. అంతేకాదుసుమా! ఆ వ్రాస్తున్నది నేనే అని తెలిస్తే నన్నుకూడా వాటితోపాటు నిలువునా తగలవేస్తారట. బాబూ, ఇక నేను పత్రికలకు వ్రాయనే వ్రాయను. వ్రాత మాట అనుకొంటేనే ఒళ్ళంతా గడగడ లాడుతుంది. కానీ, మరో ఉపాయం చూద్దాము,'' అని అఘోరించాడు.

మృగాల సర్కస్సు తిరువనంతపురంలో మకాం వేసింది. ఆ చిరునామాకు తిమ్మన్న పేరట చాలా ఉత్తరాలు వచ్చాయి. అన్నీ ఆకాశరామన్న ఉత్తరాలే! వాటినిండా ''సర్కస్సు మృగాలపైన దావా వేస్తున్నాం. మృగాలన్నిటినీ ఖైదులో పెట్టిస్తాం. ఇప్పుడే మర్యాదగా సర్కస్సు ఆపివేసి ఎవరిదారిని వారు అడవులకు పోవడం మంచిది,'' అంటూ రకరకాల బెదిరింపులే!

''నన్ను అపార్థంచేసుకోకండి. మనమేలును కోరే చెబుతున్నాను. మనకేమో ఆస్తిహక్కులు లేవాయె. బ్యాంకులో డబ్బు వేసుకోడానికీ లేదు. ఆనాడు ఆ వకీలు చెప్పలేదూ! చట్టాలన్నీకూడ మనకు వ్యతిరేకమే! అవి మనుషులకు మాత్రమేనట. అయినా, మనం మనుష్యులమధ్యనేగా రోజులు వెళ్లదీయవలసివుంది. అడవులకు ఏమనిపోతాం? ఏముఖం పెట్టుకొని పోతాం? పోతేమాత్రం అడవిమృగాలు మనల్ని దగ్గర చేరనిస్తాయా? ఆనాడు వాటిని వదలిపెట్టి వచ్చిన అక్కసుతో మనల్ని పట్టి పీకెయ్యవూ! తరిమి తరిమి వెళ్లగొట్టవూ? ఎన్నివిధాలచూచినా మనకు మనుషులఆదరణ తప్పకుండాకావాలి. కాళప్ప చెడ్డమనిషే కావచ్చు. కాని, మనల్ని చేరదీసి విద్యాబుద్ధులుగరపి ఇంతవాళ్లనుచేసిన గోవిందరావుమాష్టారు

మాత్రం మనిషి కాదూ? ఏతావాతా మనం పలక్కుండా కాళప్ప సర్కస్సులో చేరిపోవడమే మంచిదనిపిస్తున్నది. మనమంచికే ఇలా చెబుతున్నాను. తప్పుగా ఎంచుకోవద్దు,'' అని ఒకసారి మాటల సందర్భంలో జంబూ అన్నాడు.

ఒంటెలుగూడ జంబూ అభిప్రాయానికి తాళంవేశాయి. అవునవునని దాని మాటలకు ఆమోదించాయి. కొన్నాళ్ళుగా వాటికి జంబూమీద చాలా గురి కుదిరింది.

కాని, తక్కిన మృగాలు కలిసిరాలేదు. ''ఆ వెధవ కాళప్ప మన గోవిందరావుమాష్టారును మోసంచేసిన పరమద్రోహి. ఏమైనా సరే, వాడితో చేరనేగూడదు,'' అని అవి కచ్చితంగా చెప్పి వేశాయి.

ఆకాశరామన్న ఉత్తరాలు ఏమీ పనిచెయ్యలేదు. తమ పాచిక పారకపొయ్యేసరికి కాళప్పా, వకీలుపంతులూ నీళ్ళుగారి పోయారు. మృగాలసర్కస్సు రోజురోజుకూ బలపడిపోతూఉంది. కాళప్ప సర్కస్సు కూలిపోయేస్థితికి వచ్చింది. ఏందారి? యోచన చేసి చూచారు. ఏమీ తోచలేదు.

ఒకరోజు కాళప్ప గదిలో దిగాలుపడి కూర్చున్నాడు. ఉన్నట్టుండి పదిపదహైదు మంది లోపలికి జొరబడ్డారు. అందరూ ఆయన సర్కస్సులోని ఆటగాళ్ళే! అందరూ ఆయనముందు నిలబడ్డారు. అసలువిషయం ఎలా ఆరంభించాలో తోచక మిణకరిస్తున్నారు.

''ఏమిటి సంగతి?'' అని అడిగాడు కాళప్ప. వారు బదులు పలకలేదు. ముఖాల్లో కోపం తాండవిస్తున్నది.

''అడిగేది మిమ్మల్ని కాదూ? మూగల్లాగ నిల్చుంటారేం? ఏమైనా చెప్పుకోవాలనివుంటే త్వరగా చెప్పి యేడవరాదూ?''— ఇది అన్నది కాళప్పకాదు; వకీలు!

బారు ఆటలు ఆడే ఆనందరావు రకీమని ముందుకువచ్చాడు. ''చూచాంగాని, నీవు నోరు ముయ్యవోయ్ పంతులూ! ఇది మా ఉభయులకూ సంబంధించిన విషయం. తగుదునమ్మా అని అనవస

రంగా ఇందులో తలదూర్చవద్దు. దూరిస్తివో, తల ఎగిరిపోతుంది, జాగ్రత!'' అని హుంకరించాడు.

''ఖామందు కాళప్పగారూ, మీతో కొన్ని సంగతులు మాట్లాడాలి. అందుకోసమే వచ్చాం,'' అని ఉపక్రమించాడు సైకిల్ ఆటగాడు గోవిందుడు.

''ఏంకావాలి మీకు?'' అని అడిగాడు కాళప్ప.

''మా జీతాలు మాకు వెంటనే కావాలి. మూడు నాలుగు నెలలుగా బకాయిపడిపోయాయి,'' అన్నాడు రింగుమాస్టరు రంగయ్య.

''ఇదివరకల్లా మీకు జీతాలు ఎప్పటికప్పుడు ఇస్తూరాలేదూ? అప్పుడు డబ్బు చేతులో బాగా ఆడుతూ వుండింది. ఇప్పుడు పరిస్థితి మారిపోయింది. సర్కసు సరిగా నడవడమే లేదు. వ్యాపారం బాగా మందగించిపోయింది. ఇది మీకూ తెలుసు. ఇప్పుడు మన సర్కస్సుచూడడానికి



ఎవరూ రావడమే లేదు. మృగాల సర్కస్సుకే అందరూ గుంపులు గుంపులుగా వెళ్ళుతున్నారు. కాబట్టి కొన్నాళ్ళు ఓర్చుకొని ఉండండి. ఈలోపల అంతా సరిగా సర్దుబాటుచేస్తాను,'' అని కాళప్ప వారిని శాంతంగా సముదాయించాడు.

''ఇదివరకు మీరు జీతాలు సరిగానే ఇస్తూవచ్చారు. అప్పు డప్పుడు అదనంగానూ కొంత ఇస్తూవచ్చారు. నిజమే. కాని అది తీసు కొని మేముమాత్రం ఊరికేఉన్నామా? మీసొమ్ము తిన్నందుకు మేము మీ యిష్టంవచ్చినట్లెల్లా ఆడలేదూ? మీమాటలు విని ఆ మహాను భావుడు గోవిందరావుగారికి కీడుగూడ చేస్తిమే! అది ఎంత ఘోరా పరాధం. ఆయన మంచివాడు. అందువల్లనే జీతాలు సరిగా ఇప్పిస్తూ వచ్చాడు. ఎవరు, ఎప్పుడు ఏసహాయం కోరినా సంతోషంగా చేస్తూ వచ్చాడు. ఆకాలం కొండెక్కిపోయింది... సరే, ఇప్పుడేం చెబు



తారు? మా బకాయిలు మాకు తక్షణమే ఇప్పించాలి. లేకుంటే ఇదిగో ఇప్పుడే బైటికి నడుస్తాం. మీకొక దండం, మీ ఉద్యోగానికొక దండం!" అన్నాడు, బఫూన్ బాలయ్య.

"ఎట్లాగైనా తంటాలుపడి మీ బాకీలన్నీ వచ్చేనెల తప్పక తీర్చివేస్తాను. అంతవరకూ కాస్త గడువివ్వండి," అని ప్రాధేయపడ్డాడు కాళప్ప.

"వచ్చేనెల, వచ్చేనెల అని ఇలాంటి గడువులు ఇంతవరకూ ఎన్ని పెట్టారో మరచిపోయామనుకున్నారా? ఎప్పటికప్పుడు ఇలా ఏవేవో సాకులు చెప్పడమేగాని మాట నిలుపుకొన్న పాపాన మాత్రంపోలేదు. వచ్చేనెలకూడ ఇలాగే 'వచ్చేనెల ఇస్తానులె' మ్మని ఇదేపాటే పాడతారు. ఈ సాకులూ గీకులూ ఇక జాంతానై!" అని బారుఆటగాడు ఆనందరావు కొంచెం కోపంగా అన్నాడు.

కాళప్ప వకీలువైపు చూచాడు. "పంతులూ, బ్యాంకులో డబ్బు ఏమైనా ఉందా? ఉంటే, ఎందుకువచ్చిన గోల ఇది! వీళ్ల బాకీ తీర్చివేద్దాం!" అన్నాడు.

"బలేబాగుందండోయ్ మీ ప్రశ్న! బ్యాంకుకే మనం బోలెడుబాకీ ఉన్నాం తెలుసా?" అన్నాడు వకీలు.

"మీ గొడవలతో మాకేం నిమిత్తంలేదు. నేటికి పోతే పోనీండి. ఇంకొక వారంరోజులు గడువిస్తాం. ఆలోపల మా బాకీ తీర్చివేస్తేసరే సరి. లేకుంటే ఏంచేస్తామో చూచుకోండి!" అంటూ ఆనందరావు అక్కడనుంచి బయలుదేరాడు. తక్కినవారుకూడ ఆయనవెంబడే వెళ్ళిపోయారు.

కాళప్పకు పెద్ద దిగులుపట్టుకుంది. సర్కస్సుకు మూలాధారమైన ఆటగాళ్ళు వెళ్ళిపోతే ఆ తర్వాత సర్కస్సుగతి ఏమవుతుంది? సర్కస్సు 'గోవిందా, గోవిందా' అని పడుకోవలసిందేగా! సర్కస్సు పడుకుంటే ఏమవుతుందో కాళప్పకు బాగా తెలుసు. ముందొకసారి గోవిందరావు సర్కస్సు మూసివేశారు. సర్కస్సుతో

పాటు గోవిందరావు మాస్టారూ గుటుక్కుమన్నాడు. తనగతికూడ అంతే అవుతుందేమో? "పంతులూ, ఈ గండం గడిచే ఉపాయ మేదైనా కాస్త చూడవూ? ఒకే ఒక ఉపాయం కనిపిస్తున్నది. నేను జంబూకు ఉత్తరం వ్రాశాను. ఈ సంకటంనుంచీ కాపాడితే వాడే కాపాడాలి. నా కర్మంకాలి వాడూ మోసంచేసినా?"

"చెయ్యడనే తోస్తున్నది. చేశాడంటేనా కోర్టు కీడుద్దాం. అందు కొక చట్టం లేకుండానా పోతుంది? గాభరాపడవలసిన పనే లేదు," అన్నాడు వకీలు.

కాళప్ప కొంచెంసేపు యోచనచేశాడు. తర్వాత "జంబూ, నేనూ ఒక జట్టు. ఇందువల్ల నాకేకాదు, వాడికికూడా లాభముంది. కాబట్టి వాడు రాకుండా ఉండనే ఉండడు," అన్నాడు.

బయట ఎవరిదో కాళ్లచప్పుడు వినిపించింది. కాళప్పా, వకీలూ తలుపుదగ్గరకు పోయిచూచారు. బుజాన ఒకమూటతో జంబూ వస్తున్నాడు.

కాళప్ప పరుగునపోయి జంబూను ఎంతో ఆప్యాయంగా కావిలించుకొన్నాడు. "జంబూ, ఏమాశ్చర్యం! ఇప్పుడే నీమాట అనుకొన్నాను. అనుకొని, నోరుమూశానో లేదో నీవు వచ్చి వేశావు! నీకు నిండు నూటా పాతికయేండ్ల ఆయుస్సు! సందేహమే లేదు. నీవున్నావే, నీవు చాలాస్నేహపాత్రుడవు సుమా! నీవు నన్ను మరచిపోలేదు. నేనూ నిన్ను మరచిపోను. పంతులూ, జంబూకు ఇవాళ మంచి విందుచెయ్యాలి. వెంటనే తగిన ఏర్పాట్లు చెయ్యండి. మూడునాలుగు కోళ్లు తప్పకుండా కావాలి. వండిపెట్టింది వద్దు. సజీవంగానే కావాలి. అదే జంబూకు చాలాయిష్టం, గంటయ్య వచ్చిఉన్నాడు. అతనికి చెప్పండి; చాలు. మీరూ పోయి భోంచెయ్యండి. నాకూ, జంబూకూ ప్రైవేటుగా కొంచెంపని ఉంది," అన్నాడు.

బాగా చీకటిపడింది. గుడ్లగూబలు అల్లాడిపోయాయి. కుక్కలు ఊళపెట్టాయి.

•

గదిలో ఒక మసకదీపం వెలుగుతున్నది. ఆ రాత్రిపూట ఒక భయంకరమైన కుట్రకు సన్నాహం జరుగుతున్నది.

గంటయ్య తలుపుతోసుకొని గదిలోకి వచ్చాడు—ఆహారం తీసుకొని. వాళ్ళు అతన్ని గమనించనేలేదు. మాటల్లో మునిగిపోయి ఉన్నారు. గుంటనక్క కనబడంగానే కోళ్ళు గొల్లున అరపుకు లంకించుకొన్నాయి. వాటి అరపు జంబూ ఆకలిని రెచ్చగొట్టింది. కాసేపట్లోనే వాటి అరపు అణగిపోయింది. అసలు కోళ్ళు ఉంటేగా అరపు ఉండడానికి! అవి ఎప్పుడో జంబూకడుపులోకి వెళ్ళిపోయాయిగా!

"గంటయ్యా, నీవు బయట నిలుచుకొనిఉండు. తలుపు తెరిచి ఉంచవద్దు. ఎవరైనా వస్తే వెంటనే వచ్చి నాకుచెప్పు," అని కాళప్ప ఉత్తరువుచేశాడు.

గంట పది అయింది; పదకొండుకూడ అయింది. కాని, కాళప్పా జంబూల సంభాషణమాత్రం ముగియలేదు. ఏదో ఒక మహా ముఖ్యమైన విషయాన్ని గురించి ఎడతెగకుండా మాటలు సాగిపోతున్నాయి. ఈ సంగతి గంటయ్యకు తెలిసింది. ఎన్ని పనులు ఇలా నడిచాయో! ఎవరికొంప ముంచడానికి వేస్తున్న పథకమో ఇది! అది కనిపెట్టాలని గంటయ్యకు ఆత్రం. అతడు తలుపు కాస్త తెరిచాడు. చెవులు రిక్కించుకొని విన్నాడు. కాళప్పా, జంబూ బహు రహస్యంగా, మెల్లిగా మాట్లాడుకొంటున్నారు. అయినా వారి మాటలు గంటయ్యకు బాగా వినిపించాయి.

"సరి, అలాగే చేద్దాం," అన్నాడు కాళప్ప.

"అలాచేస్తేనే వారికి బుద్ధివచ్చేది," అన్నాడు జంబూ.

"ఆ తర్వాతకూడ వారు ఒప్పుకోకపోతే?"

"ఒప్పుకొని తీరాల్సిందే. నేను గట్టిగా చెబుతాను."

"అదెలాగు?"

"నాయకుడు తిమ్మన్నగదూ! వాడు లేకపోతే తక్కినవారు ఏంచేయగలరు?"

"సెబాష్! తర్వాత వారందరూ మనవలలో పడిపోతారు కదూ?"

"అందుకు సందేహమా?"

"ఆ తర్వాతనే మన ఒప్పందం."

"మన ఒప్పందం ప్రకారం మీరు కంపెనీ యజమాని."

"నీవు కంపెనీ మేనేజరు."

"వాళ్లందరికీ మనం సరియైన పాఠం చెప్పించాలి.



వెనుకటిగోవిందరావు సర్కస్సుకన్నా మన సర్కస్సు ఎంతో గొప్పదిగా క్రియారూపంలో చూపించాలి."

"ఇక మనకు మంచికాలం వచ్చింది. సందేహమేలేదు."

"ఒక గుంటనక్క సర్కస్సు నడపగలదని చేతలో చూపించాలి."

"కోతియే నడిపింపగలిగినప్పుడు గుంటనక్క ఎందుకు నడిపించలేదూ అంట!"

అంతా అయింతర్వాత జంబూ తన మూటవిప్పాడు. లోపలినుంచి ఒక తోలుసంచి బయటికి తీశాడు. అందులోనుంచి కట్టలు కట్టలుగా నోట్లుతీసి కాళప్పముందు పోగుపెట్టాడు. "ఇదుగో! ఇవి మీకే, ఉడుతాభక్తిగా నేను మీకిస్తున్న చిన్న బహుమానం!" అన్నాడు.

కాళప్ప సంతోషానికి అంతేలేదు. అతడు ఇంతవరకూ డబ్బులేక అల్లాడిపోతుండినాడు. "ఇంకొక వారంరోజుల్లోపల తన ఆటగాళ్ల బకాయిలన్నీ తీర్చివేయాలనే! లేకుంటే అందరూ కట్టకట్టుకొని బయటికి వెళ్ళిపోతారే, ఏం దారిరా భగవంతా!" అని అఘోరిస్తూ ఉండినాడు. అయితే, ఇప్పుడు ఆ అఘోరింపంతా పరుగెత్తిపోయింది. ఆనందం పట్టలేక జంబూను అల్లాగే సందిట్లోకి తీసుకొని ఒళ్లంతా నిమిరాడు. "నా బంగారు జంబూ, నీ ఋణం ఎలా తీర్చుకోగలను? నీకు నా కృతజ్ఞత ఎలా తెలుపుకొందును? మన కార్యం జయప్రదం కానీ. ఆ తర్వాత కాళప్ప సర్కస్సుకు మేనేజరెవరు? నా ప్రియమైన జంబూయే," అని తన ప్రేమ అంతా వెళ్లబోశాడు.

తాను ఏంచేస్తున్నాడో గ్రహించుకోకుండా పోలేదు జంబూ. మంచిచెడ్డలన్నీ మననం చేసుకొనే ఈ ఆట ఆడుతున్నాడు. మృగాలకో ఆస్తి హక్కులేదు. డబ్బు బ్యాంకులో వేసుకోవడానికీ లేదు. వకీలు చెప్పిన చట్టంకూడ అతని జ్ఞాపకానికి వచ్చింది. బ్యాంకు మేనేజర్ వర్గీస్ తిమ్మన్న విషయంలో చూపిన తీరుకూడ అతని మనస్సులో మెదులుతూనే ఉంది. కాని ఈ పరిస్థితి కలకాలం ఇట్లే తిష్ఠవేసుకొని ఉంటుందా? అడవిమృగాలకంటే డబ్బుతో అవసరం

లేకపోవచ్చు. కాని ఊర మృగాలకుగూడ అదే సూత్రమేనా? అవి మనుషులలో మనుషులుగా జీవించడం లేదూ? మనుషులకున్న హక్కులు వాటికీ లభించేకాలం రాకుండానా పోతుంది? ఆకాలానికే ఎదురుచూస్తున్నాడు జంబూ.

"నేను సర్కస్సు మేనేజర్ని కానీ. అప్పుడు తెలుస్తుంది నా సామర్థ్యం! ఇప్పటిమట్టుకు కాళప్పను తృప్తిపరచి తీరాలి," అనుకొన్నాడు జంబూ.

తర్వాత కాళప్పవైపు తిరిగి "దేన్ని చూచినా చెదరనివాడూ, ఏది చెప్పినా చేసేవాడూ, ఎటువంటి కిరాతకపు పనికూడ చెయ్యడానికి జంకనివాడూ, మనస్సాక్షి అనేదే బొత్తిగా లేనివాడూ—ఒకడు మనకు కావాలి. ఎవడైనా దొరుకుతాడా? దొరికితే, తక్కినదంతా నేను చూచుకొంటాను," అని అడిగి మేజాపైన ఒక గుద్దుగుద్దాడు.

"ఇంతే గదా! ఇటువంటి గుణాలన్నీ గలవానిని నేను ఇస్తాను. నీవు గంటయ్యను బాగా చూడలేదనుకొంటాను....ఒరేయ్ గంటయ్యా! ఇలా రా!" అని కాళప్ప ఒక్క కేక వేశాడు.

తలుపుతీసుకొని గంటయ్య లోపలికి వచ్చాడు. ఇందాకా క్లోళ్లు తెచ్చింది గంటయ్యే. కాని జంబూ అతన్ని అప్పుడు అంత పరీక్షగా చూడలేదు. మాటల స్వారస్యంలో ఉండిపోయాడు. ఇప్పుడు, మసక మసకగా ఉన్న దీపాన్ని కాళప్ప ఎగదోశాడు. జంబూ గంటయ్యను ఎగాదిగా పరిశీలించాడు.

ఆ ఆకారాన్ని చూచి జంబూకూడ భయపడిపోయాడు. ఎదురుచూచినంతకన్నా భయంకరంగా ఉన్నాడు అతను. కిరాతకాలు చేయడానికి సందర్భం లభిస్తున్నందుకు అతగాడు ఎంతో సంతోషించాడు. అతని ముఖం చూడంగానే ఆ సంతోషం అందులో స్పష్టంగా తెలిసింది. "గంటయ్యా, గంటల్లోనే నిన్ను జంబూవద్దకు పంపుతాను—రెండు కిరాతకపు పనులు చెయ్యడానికి.

తెలిసిందా? చిక్కబడకుండా ఎలా చేస్తావో మరి!'' అని కాళప్ప అతగాణ్ణి హెచ్చరించాడు.

వెంటనే గంటయ్య ముఖం ముడుగుకొనిపోయింది. ''ఏమిటి దొరా! ఇంతా చేస్తే రెండే రెండు కిరాతకాలేనా? ఏడో ఎనిమిదో చేయమంటారనుకొన్నానే!'' అని నోరు చప్పరించాడు.

ఇది విని కాళప్పా, జంబూలు ఒకరినొకరు చూచి చిరు నవ్వులు నవ్వుకొన్నారు.

## 7

ఇంత బ్రహ్మాండమైన గుంపు ఇదివరకు చూచిందే లేదు. కొల్లం అనే ఊరిలో మకాం వేసిన మృగసర్కస్సు డేరాలో అంత పెద్ద గుంపు చేరింది. తాపీగా కూర్చోవడానికి చోటేలేదు. కాళ్ళూ చేతులు కదిలించడానికికూడ ఆస్కారంలేదు. ఇప్పుడుగనక ప్రమాదవశాత్తూ ఏదైనా విపరీతం జరిగితే...? అటూ యిటూ మెదల డానికిగూడ సందులేని పరిస్థితిలో తప్పించుకుపోవడం ఎలాగ?

ఆనాడు మృగసర్కస్సు కంపెనీ వార్షికోత్సవం. అందుకై ప్రత్యేకంగా కొన్ని వింతలూ, విశేషాలూ, వినోదాలూ తయారు చేయించారు. ఆరోజు ప్రవేశరుసుంకూడ లేదు. ఎవరుబడితే వాళ్ళు నిరభ్యంతరంగా రావచ్చు. అంతేకాదు. వచ్చిన యావన్మందికీ ఉచితంగా తినుబండారాలుగూడ పంచిపెట్టారు. అటువంటప్పుడు ఇంక అంత గుంపుచేరడంలో ఆశ్చర్యమేముంది?

ఇక కాసేపట్లో సర్కస్సు ఆరంభమవుతుంది. మేనేజరు తిమ్మన్న రంగంమీదికి వచ్చాడు. అక్కడ ఒకమూలగా ఒక పెద్ద ఫోటో నిలబెట్టారు. దానికి పెద్దపూలదండకూడ వేసిపెట్టారు. తిమ్మన్న సభవారందరికీ ఒక నమస్కారంచేసి, ఆ పటాన్ని చేతితో చూపిస్తూ, ''ఈపటం ఎవరిదో బహుశా మీకు తెలిసి ఉండక పోవచ్చు. నేను చెబుతా వినండి. ఏ మహానుభావుడు మాకు మహామహా సర్కసువిద్యలు నేర్పాడో, ఏమహానుభావుడు

మమ్మల్ని సొంత బిడ్డల్లాగా సాకాడో, ఏమహానుభావుని పవిత్రాత్మ ఇప్పటికీ మమ్మల్ని ఆశీర్వదిస్తున్నదో ఆ మహానుభావుని చిత్రపటం ఇది. దయయుంచి అందరూ ఒక్కనిమిషం లేచి మా గోవిందరావు మాష్టారు ఆత్మశాంతికి ప్రార్థన చెయ్యవలెనని కోరుతున్నాను.''

వెంటనే అందరూ లేచి నిలుచున్నారు. తలవంచి ప్రార్థన చేశారు.

సర్కస్సు ఆరంభమయింది. మొదటిఘట్టమే ఎంత అద్భుతంగాఉంది! పదహారడుగుల పొడుగు, నాలుగడుగుల వెడల్పుగల ఒక తెల్లగుడ్డ తోరణం. దానిలో 'సుస్వాగతం' అని పెద్దపెద్ద అక్షరాలు—రంగుకాగితాలు కత్తిరించి తయారుచేసినవి—అంటించి పెట్టారు. ఆ తోరణాన్ని పక్షులు ముక్కులతో భద్రంగా పట్టుకొని ఆకాశంలో మెల్లగా ఎగిరివస్తున్నాయి. తెరచాటున వీనులవిందుగా మధురగానం వినిపించింది. ఆగానం చేసిందెవరు? వేరెవరో కాదు. అరడజను పిల్లులు. ముద్దులుమూటగట్టే ఒక తెల్లగాడిద రంగం మీదికి వచ్చింది. తాటాకులతో చేసిన నాలుగైదు కుళ్లాయిలు విరున మీదికి విసిరింది. అవి ఒక్కొక్కటీ పైకి పైకి వెళ్ళి తర్వాత మెల్లగా క్రిందికి దిగివచ్చి దాని తలమీదనే తిష్ఠవేశాయి.

ఆ తర్వాతిఘట్టం ఒక సరికొత్త నాట్యం! నీలి నిజార్లూ, ఎర్రని అంగీలూ వేసుకొన్న అరడజను హంసలు పైనున్న తీగలమీదికెక్కి ఒయ్యారంగా ఆడాయి. పచ్చనిగోడుగులు పట్టుకొని అందంగా అడుగులు వేస్తూ లయబద్ధంగా అవి చేసిన లాస్యం అందరిచేతా లాస్యమాడించింది.

నాట్యప్రదర్శనం పూర్తికాగానే ఒక కంచరగాడిద ముందుకు వచ్చింది. దానిని చూడంగానే పసిపిల్లలు ఉత్సాహంతో నానా హంగామా చేశారు. అదేమిటది? సింహం గర్జిస్తున్నదా? ఇంతలో ఇదేమిటి గుఱ్ఱం సకిలింపు! అదిగో అది కుక్క మొరుగుడుకదూ! ఎక్కడోగాని పిల్లులు. మ్యావు మ్యావు మంటున్నాయి! వెర్రినాయ

నలారా! మీరు భ్రమపడుతున్నారు. ఈ కంచరగాడిదే గొంతు మార్చి మార్చి రకరకాల అరుపులు వినిపిస్తున్నది.

తరువాత ఆట దున్నపోతుల ఆట. దుక్కలాంటి ఒక దున్నపోతు పరుగెత్తివచ్చి రంగంలో వెల్లకిలా పడుకొంది. పడుకొన్నది పడుకొన్నట్టుగానే నాలుగుకాళ్ళూ నిటారున పైకి జాపింది. ఇంతలో లోపలినుంచి మరొక మూడు దున్నపోతులు ఒక నిచ్చెన




మోసుకొని వచ్చాయి. దానిని ఆ పడుకొనిఉన్న దున్నపోతు కాళ్లపై పండబెట్టి, తాము ఆ నిచ్చెనపైకెక్కి, రకరకాలుగా పిల్లిమంత్రాలు వేశాయి.

మేకపిల్లలుగూడ జారుడు ఆట ఆడుతాయని ఇంతవరకు ఎవరికీ తెలియదు. ఈరోజునే అది తెలిసింది. ఒక మేకపిల్లవచ్చి నాలుగుబంతులతోనేకాదు, ఆరు ఇనపగుండ్లు, ఎనిమిది సోడాబుడ్లు, మొదలైన వాటితోకూడ అనేక జారుడువిద్యలూ దొర్లుడు విద్యలూ చూపెట్టింది.

ఇదంతాసరేగాని, ఇంతకూ ఆవెనుకటి మృగాలన్నీ ఏమైనట్లు? ఏమూతాయి? అక్కడే ఉన్నాయి.

అవికూడ తమతమ
విద్యలు చూపించాయి. అయితే ఆనాడు
వార్షికోత్సవంకదూ! అందుచేత అవి
కూడ కొత్తకొత్త విద్యలు చూపెట్టాయి.

సాధారణంగా ఒక్కొక్కటి ఒక్కొక్క విద్యే చూపెడుతుంది. అంతమాత్రంచేత వాటికి ఆ ఒక్కొక్క విద్యే తెలుసునని భ్రమపడరాదు, వాటికి ఇంకా కొన్ని విద్యలుకూడ తెలుసు. అలా తెలిసిఉంటేనే సర్కస్సులో వృద్ధికి వచ్చేది! ఎప్పుడైనా ఒక మృగానికి జబ్బుచేస్తే, అది చేసే విద్యను ఇంకొకటి చేసి చూపాల్సిందే. ఆరోజు అందరూ బాగానే ఉన్నారు. అయినా ఆరోజు ఉత్సవదినం కాబట్టి ఆదినం గారడీవిద్యలు చేసింది ప్రొఫెసర్ జంబూకాదు; చిన్నతిమ్మన్న. కత్తులు విసిరింది పులులుకాదు; ఎలుగుబంట్లు. ఒహో! వాటికికూడ ఈ విద్య తెలుసన్నమాట. సింగన్న వేసే పిల్లిమంత్రాలు ఆరోజు గజేంద్రుడు వేశాడు. ధాటీ శరీరమైనా, పిల్లిమంత్రాలు వేయడంలో గజేంద్రుడేమీ తప్పటడుగులు వేయలేదు. లఘువుగానే వేస్తూవచ్చాడు. ట్రెపీజ్ ఆటలు ఆవాళ పులులు ఆడాయి.

తెల్లశునకం వెల్లయ్య రంగానికి వచ్చాడు. ఆవాళ అతడుకూడ పాత ఆట ఆడలేదు. మోటారుసైకిలు తొక్కడానికి తయారై వచ్చాడు. అతనికి సైకిల్ తొక్కడంకూడ వచ్చు. వాడు సైకిల్

ఎక్కబోయాడు. కాని ఎందుకో ఎక్కలేదు. జంకాడు. కారణం? అతనికి ఏదో అనుమానం కలిగింది. అది చూసి తిమ్మన్న వెల్లయ్య దగ్గరకు వచ్చాడు.

వెల్లయ్యా, తిమ్మన్నా మెల్లగా ఏదో మాట్లాడుకొన్నారు. వెల్లయ్య చేతులతో ఏవో సైగలుచేశాడు. చుట్టిచుట్టి చూసి పసి పట్టాడు.

"ఏంవెల్లయ్యా, ఏదో ఒకమాదిరిగాఉన్నావు? నీ మోటారుసైకిలు విద్దెలు చూడడానికి ప్రేక్షకులు కాచుకొన్నారు. ఊఁ. త్వరగాకానీ!" అని హెచ్చరించాడు తిమ్మన్న. వెల్లయ్య మళ్లీ పసిచూసి "తిమ్మన్నా! ఎవడో ఒకమనిషి, వాడెవడో తెలియదు. కాని, తెలిసిన మనిషిగానే కనిపిస్తున్నాడు," అని చెప్పాడు.

తిమ్మన్న వెల్లయ్యవీపు నిమురుతూ, "ఎవరైతే మనకేమి? నీవు మోటారు సైకిలెక్కు!" అని త్వరపెట్టాడు.

వెల్లయ్య తూర్పువేపు తిరిగాడు. మళ్లీ పసిచూసి, "తిమ్మన్నా అదిగో తూర్పుతట్టు ఎక్కడో ఉన్నాడు, విరోధి. నాకు ఇష్టంలేని వాడనేదికూడా నిశ్చయం. అలవాటైన వాసన. ద్రోహంచేయడానికై వచ్చినట్టున్నాడు. సందేహంలేదు. తిమ్మన్నా, నీవు ఇక్కడే ఉండు. నేనుపోయి వానిని కనిపెట్టివస్తాను. వచ్చి మోటారు సైకిలు ఆట చూపిస్తాను. సరేనా!" అన్నాడు.

ఆమాటకు జవాబు చెప్పినవాడు తిమ్మన్నకాదు; జంబూ! వాళ్ళు మాట్లాడుకొంటున్నదంతా వాడు విన్నాడు. "వెల్లయ్యా, నీకు మోటారుసైకిలు విద్య బాగా తెలియదంట. అందరూ చెప్పుకొంటున్నారు. అదిగోచూడు, వారెలా సణుగుకొంటున్నారో, ఇది మనకు అవమానంకాదూ! ప్రజలకు కించిత్తయినా దురభిప్రాయం కలగరాదు. అది మన వ్యాపారానికి దెబ్బ. తిమ్మన్నా, వెల్లయ్యను సైకిలు తొక్కమను. నేనుపోయి ఆమనిషెవరో తెలుసు

కొని వస్తాను,'' అన్నాడు గుండెలో కొండంత దడతోనే. తిమ్మన్న కూడ ఒప్పుకొన్నాడు. వెంటనే జంబూ అక్కడనుంచి మాయమైనాడు.

వెల్లయ్య మోటారుసైకిలువిద్య అంతగా రక్తికట్టలేదు. వాడి మనస్సులో ఏదోభయం పట్టుకొంది. అది తిమ్మన్నకు బోధపడిపోయింది. వెల్లయ్య మాటికి మాటికీ కిందికి దిగుతూవచ్చాడు. తూర్పువేపుతిరిగి పసిచూస్తూ వచ్చాడు.

సింగన్న తీగమీదికెక్కాడు, రోజూ గజేంద్రుడు చూపే విద్య చూపడానికని. వెల్లయ్యకేమో ఇప్పుడు గాదప్పుడువెళ్ళి ఆమనిషిని కనిపెట్టాలని చాల కుతూహలంగాఉంది. కాని ఏం చెయ్యడం ? వీలుపడకుండా ఉందే! సింగన్నకు కప్పులూ సాసర్లూ అందించేపని తనపాలబడిందే! ఇది ముందే నిర్ధారణ అయిపోయింది. మార్చడానికి వల్లకాదు. తిమ్మన్న బిగ్గరగా, '' మహాజనులారా, దయచేసి కాసేపు నిశ్శబ్దంగా ఉండండి. శబ్దంచేస్తే సింగన్నకు ఆపత్తు. దయచేసి శబ్దంచెయ్యకండి,'' అని అడుక్కొన్నాడు.

డేరాఅంతటా నిశ్శబ్దం అలముకొన్నది. వారి వారిగుండెలు కొట్టుకోవడంకూడా వారి వారికి వినిపించింది. వేలాదుకండ్లు సింగన్నను చూస్తున్నాయి. రెప్పలు మూయలేదు. వెల్లయ్య కప్పులూ సాసర్లూ సింగన్నకాలిమీద మెల్లగా పెడుతున్నాడు. అవి ఒక్కొక్కటిగా పైకి వెళ్ళాయి. చివరకు అలాగే తిరిగివచ్చి సింగన్న తలమీద వచ్చివాలాయి.

డేరాలో తూర్పుతట్టున ఉన్నట్టుండి ఒకవెలుగు కనిపించింది. అదిక్రమంగా పెద్దదవుతూ వచ్చింది. ఎవ్వరూ అది గమనించనేలేదు. అందరికళ్లూ సింగన్న చూపుతున్న విద్యమీదనే ఉన్నాయి.

'' అగ్గి, అగ్గి! '' అని ఒక గావుకేక తటాలున వినబడింది. అవును. డేరాలో తూర్పుతట్టున అగ్గి! ఒక్కక్షణంలో ఆగావుకేక వేలాదుగొంతుల్లో ప్రతిధ్వనించింది. అప్పుడు పుట్టిన కల

కలాన్ని వర్ణింప తరంకాదు. వేలారుమంది జనం చేరిన ఒక డేరాలో ఆకస్మికంగా ఇలా నిప్పంటుకోవడమంటే ఎటువంటి భయంకరమైన విషయం!

"అగ్గి, అగ్గి!" అని అరుస్తూనే అందరూ అదరాబాదరా లేచారు. పడమటిపక్కన ఒక్కటే ఒక చిన్నదారి ఉంది బయటికి. అందరూ ఆవేపుకు పరుగులు తీశారు. ఒక్కటే వేపుగా, వేలకు వేల మంది తొందర తొందరగా పరుగులు తీశారంటే ఇక ఆసందడీ, ఆతోపుళ్లూ, ఆమోదుళ్లూ, ఆ త్రొక్కుళ్లూ ఇక చెప్పవలసిందేముంది? ఆ అలజడిలో కొందరు కిందపడిపోయారు. పడినవారిని లేపేవారు లేరు. లేపుదామన్నా వీలుకాదు. వెనుకనుంచి జనం విరుచుకొని పడుతూవుంటే అదేం వీలవుతుంది! ఎట్లాగయినా తప్పించుకొని పారిపోవాలి; ప్రాణాలు కాపాడుకోవాలి అనే ప్రాణసంకటపు పోరాటంలో అందరూ సతమత మవుతున్నారు. ఆ సందడిలో కిందపడ్డ వారిని తొక్కుకుంటూ పోవడానికికూడ చాలామంది జంక లేదు.

క్షణాలమీద నిప్పు వ్యాపించిపోతున్నది. డేరా తూర్పువైపు అంతా మండుకొనిపోతున్నది. అది అల్లాగే ముందుకుకూడ వస్తున్నది-దారిలో అడ్డుతగిలిన వానినన్నిటినీ నిర్దాక్షిణ్యంగా కబళించుకొంటూనే వచ్చివేస్తున్నది.

"నిప్పు, నిప్పు!" అనే గావుకేకలు అంతులేకుండా గుండెలు కరిగిస్తూనే ఉన్నాయి. కాలు సరిగా ఊనించి తాపీగా నడవడానికి ఎవ్వరికీ సాధ్యపడలేదు. గుంపులో చిక్కుకొని, ఆ త్రోపుళ్లలో అటూ ఇటూ పడిపోయి ఎందరో అల్లాడిపోయారు. ఒకటిగా ఉన్నవారు ఎవరికి వారు చీలిపోయారు. తమ బిడ్డలు కనబడక తల్లిదండ్రులు తపించారు. తలిదండ్రులు కనబడక పసిపిల్లలు తపించిపోయారు. ఏడ్పులూ, పెడబొబ్బలూ దిక్కులు మారుమోగుతున్నాయి.

ఈ స్థితిలో పాపం, సర్కస్సు మృగాలు ఏంచేస్తాయి? అవి మాత్రం బయటికి ఎలా పోతాయి? పైగా, నిప్పు అంటే వాటికి

ఎంతభయమని! పక్కవారి గొంతులుకూడ పక్కవారికి వినిపించని అంత పెద్ద గోలలోకూడ ఉన్నట్టుండి, ఎక్కడినుంచో, చిన్న తిమ్మన్న గొంతు వినిపించింది: "సహచరులారా, మన ప్రాణాలు నిలువునా పోయినా సరే, ముందు ఈ ప్రజల ప్రాణాలు మనం కాపాడితీరాలి. రండి, వెంటనే నా వెంటరండి."

చిన్న తిమ్మన్న నైరృతిమూల వైపు పరుగుతీశాడు. వాని వెంటనే తక్కిన మృగాలుగూడ వెళ్లాయి. అందరూ కలిసి అక్కడి డేరాగుడ్డ చింపివేసి బయటికి దారిచేశారు. జనం దానివెంట బయటికి పరుగులుపెట్టారు. తర్వాత మృగాలు వాయవ్యమూలకు వెళ్లాయి. అక్కడా అదే పనిచేశాయి. సందుదొరికిందే చాలని అక్కడివారు ఆదారినుంచి తప్పించుకు పోయారు. మొత్తం మీద ఎలాగయితేనేం, జనం అంతా బయటపడ్డారు. అప్పటికిగూడ అనుమానం తీరక మృగాలు మూల మూలలకూ పారజూచి, జనం ఎవ్వరూ లేరని గట్టిగా తేల్చుకొని, "అమ్మయ్యా, బతికిపోయాం!" అంటూ పెద్ద నిట్టూర్పు విడిచాయి. తమ ధర్మం తాము చేయగలిగినందుకు కొండంతగా సంతోషించాయి. అటుతర్వాతనే అవి తాపీగా బయటికి వచ్చివేశాయి.

నిప్పు మరింత మరింతగా వ్యాపించిపోతున్నది. మంటలు విలయతాండవం చేస్తున్నాయి. గుప్పుగుప్పున పొగలులేచి కారు మేఘాల్లాగా ఆకాశమంతా అలముకొంటున్నాయి. మళ్ళీ చిన్న తిమ్మన్న గొంతు వినిపించింది: "సహచరులారా, డేరా సగానికి పైగా తగలబడిపోయింది. మిగిలినదాని నన్నా కాపాడదాం. వెంటనే నిప్పు ఆర్పివేద్దాం. రండి, రండి."

ఒక పీపాయి బుజాన వేసుకొని చిన్నతిమ్మన్న దగ్గరఉన్న ఒక గుంటకు పరుగుతీశాడు. తక్కిన మృగాలుకూడ అలాగే పీపాలు మోసుకొని, వానివెంటనే వెళ్లాయి. కొందరు మనుషులుగూడ సాయంచేయడానికి ముందుకువచ్చారు. కొందరు ఇరుగుపొరుగు ఇండ్లకువెళ్లి బాల్చీలూ, బిందెలూ, తపిలెలూ, అండాలూ మొద

పైనవి అడిగి యిప్పించుకోని గుంటకు పరుగెత్తారు. నీళ్లుతెచ్చి నిప్పు ఆర్పడానికి ఆరంభించారు. ఎన్నినీళ్లు కొట్టినా లాభం లేకుండానే పోతున్నది. "నన్ను అణచడం, వెట్టి నాగన్నలారా, మీ తరమా!" అనుకొంటూ నిప్పు చిలవలు పలవలుగా వ్యాపించి పోతూనే ఉంది.

అదా, మండు వేసంగి! కాస్త ఏమారితే సరి, గబుక్కన నిప్పంటుకొనే కాలం. చాలనందుకు గాలికూడ దానికి తోడయింది.



ఆగాలి ఆసమయానికి సరిగ్గా ఎక్కడనుంచి వచ్చిందో మరి! ఆ అగ్ని దేవునికి సాయంచేయడానికే వచ్చిందేమో! చూస్తే అలాగే కనిపిస్తున్నది. డేరా అంతా తగలబెట్టి పూర్తిగా భస్మపటలం చేసిన పిమ్మటగాని ఈ నిప్పు అణగదేమో! మృగాలూ, మనుషులూ కలిసి కంబాలు పట్టుకొని పైకి ఎగబ్రాకారు. అక్కడ నిలుచుకొనే, మంటలు రాజు కొంటున్నచోట్ల మీాదంతా నీళ్ళు చిమ్మారు.

గజేంద్రుడు గుంటకు పరుగెత్తాడు. తొండంనిండా నీళ్ళుపీల్చుకొని పరుగు పరుగున వచ్చాడు. కాని ఫలితం లేకపోయింది.

డేరానేకాదు, డేరాలోని సర్కసు సామానులన్నిటినీకూడ స్వాహా చేసి వేస్తున్నాడు అగ్నిదేవుడు. చివరకు మృగాలకు బాగా తెలిసి పోయింది—ఈ నిప్పు అణిగేరకం కాదని.

"ఇది మనవల్ల కానిపని. అన్నిటినీ కాల్చి మసిచేసినపిమ్మట ఇది తనంత తానే అణిగిపోవలసిందే!" అనే నిర్ణయానికి వచ్చి వేశాయి. తమ ప్రయత్నాలు మానివేశాయి. వెక్కి వెక్కి ఏడవడం ఆరంభించాయి.

ఏడవక మరి ఏంచేస్తాయి? తమ చేతులారా కట్టుకొన్న సర్కస్సు డేరా తమ కండ్లయెదటనే కాలి మసి అయిపోతున్నదే! కొంచెంసేపటికి ముందున్న పరిస్థితి ఏమిటి? ఆడేరా ఆకాశం ఎత్తున తలయెత్తుకొని నిలుచుకొని ఉండింది. లోపల జనం గుంపులు గుంపులుగా నిండుకొని ఉండినారు. డేరా యందంతటా ఉత్సాహమూ, ఉల్లాసమూ, ఆనందమూ తాండవమాడుతుండినాయి. ఇప్పుడో? ఆడేరా స్థానంలో ఒక పెద్ద బూడిదగుట్ట దర్శనమిస్తున్నది!

ప్రజలుకూడ వలవల ఏడ్చారు. వారు సర్కసు మృగాలంటే పంచప్రాణాలూ విడుస్తూ వచ్చారు. ఆ మృగాల సర్కస్సు వారిని ఆనందసాగరంలో ఎంతగానో తేలియాడిస్తూ ఉండింది. పట్టరాని దుఃఖంతో పరితపిస్తూ వాళ్ళు ఇళ్లకు మళ్లారు.

మృగాలు, శ్రీరామరక్ష, పల్లెత్తి మాట్లాడలేదు. దేనిని గురించి మాట్లాడతాయి? ఏమని మాట్లాడతాయి? అంతా ముగిసి పోయిందే! ఇంతకాలం పాటుపడిందంతా దండగకు పాడైపోయిందే! ఎన్నాళ్ళ పస్తులు! ఎన్నెన్ని తిప్పట్లు! ఎన్నెన్ని కష్టాలు! ఎన్నెన్ని కడగండ్లు! ఇంత కష్టపడి పెంచిన కంపెనీ క్షణాల్లో నిప్పులపాలయి పోయిందే! అయ్యో పాపం!

గజేంద్రుడూ, సింగన్నా హోరుమని ఏడ్చారు. మిక్కిలి శక్తిమంతుడు గజేంద్రుడు. అయితే పరమసాధువు. మిక్కిలి కోపిష్ఠి సింగన్న. కాని, నిజాయితీగలవాడు. పులి పల్లయ్యా, ఎలుగు నల్లయ్యా, గుర్రాలూ ఒకవంక తలలు వేలవేసుకొని కంటికి కడ

వెడుగా కన్నీళ్ళు విడుస్తున్నాయి. జంబూ, పులి చల్లయ్యా, ఎలుగు తౌడయ్యా, ఒంటెలూ కొంచెం దూరంగా పండుకొని నిద్ర పోతున్నాయి.

చిన్నతిమ్మన్న ఏడవనూ లేదు; నిద్రపోనూ లేదు. డేరాను, అంటే క్షణం కిందటివరకూ డేరాగా ఉండిన బూడిదగుట్టను రెప్ప వాల్చకుండా చూచుకొంటూ, అటూ ఇటూ కదలక మెదలక అలాగే కూర్చుండిపోయాడు. అతనికి లోలోపలే దుఃఖం పొంగి పొర్లిపోతున్నది. సహజంగానే ఎల్లప్పుడూ సంతోషంగా ఉండేవాడు చిన్నతిమ్మన్న. తక్కినవారికి సంతోషం కూరుస్తూవచ్చినవాడూ అతనే. వారిని విచారం పట్టుకొన్నప్పుడెల్లా కడుపు చెక్కలయ్యేటట్లు నవ్విస్తూ ఉండేవాడు. విదూషకుడు కదూ వాడు! నవ్వించడమే వానిపని! ఇదంతా డేరా తగలబడిపోయే ముందువరకే! ఇక వాడు ఎవరిని సంతోషపెట్టాలి? ఎవరిని నవ్వించాలి. సర్కసు ఉంటేకదూ అవన్నీ కావాలి! సర్కస్సే తగలబడి భస్మమయిపోయిందే!

దుఃఖంలో మునిగియుండిన చిన్నతిమ్మన్న తటాలున తల మెత్తాడు. అతని కళ్ళలో ఏదోఒక వెలుగు తళుక్కున మెరిసింది. ఏదోఒక యుక్తి అతని మనస్సులో తోచిందన్నమాట! వెంటనే తన అన్నను కలుసుకొని ఆ విషయం మాట్లాడాలని అతని కనిపించింది.

"అన్నయ్యా!" అని పిలిచాడు. బదులు లేదు. అలసిపోయి ఎక్కడైనా పండుకొని ఉంటాడని అనుకొన్నాడు. మళ్ళీ గొంతెత్తి పిలిచాడు. దానికీ బదులు లేదు! చిన్నతిమ్మన్న చుట్టుపట్టులంతా తిరిగి వెదికాడు. అన్నయ్య కనబడనే లేదు. తక్కినవారిని అడిగి చూచాడు. "ఏమిటేమిటి? తిమ్మన్న కనబడలేదా? మాకు తెలియదే!" అన్నారు వారు.

"చింతపడకండి. మేనేజరు తిమ్మన్న ఎక్కడికిపోతాడు? ఇక్కడే ఎక్కడో ఉంటాడు," అన్నాడు జంబూ. జంబూ ముఖంలో ఒక ముసిముసినవ్వు తోచినట్టే తోచి మరుగయింది. చిన్న

తిమ్మన్నకు అల్లా అని ఒక అనుమానం. కాని, అనుమానపడి అలాగే నిలబడిపోవలసిన సమయంకాదది. చిన్నతిమ్మన్న చింత ఎక్కువైపోయింది. వాడు గజేంద్రుడూ మొదలైనవారిని కేక వేశాడు. అందరూ కలిసి ఆ మైదానమంతా కలయవెదికారు. "అన్నయ్యా, అన్నయ్యా!" అని చిన్నతిమ్మన్న మాటిమాటికీ పిలుస్తూనే ఉన్నాడు. కాని జవాబుమాత్రం లేదు. డేరా తగలబడి బూడిదైపోయింది. అంతకన్నా మహావిపత్తు తిమ్మన్న కనబడక పోవడం. కష్టాలు ఒకటిగా రావన్నది ఖాయమన్నమాట!

తిమ్మన్న కనబడలేదు. ఎక్కడపోయినట్టు?

# 8

తిమ్మన్న మైకంనుంచి తేరుకొని కండ్లుతెరిచి చూచాడు. మంచు కమ్ముకొన్నదా యేం? లేదు. కాని ఏదీ స్పష్టంగా కనబడడం లేదు. మెల్లగా లేచి కూర్చున్నాడు. చుట్టూ కలయజూచాడు. కండ్లు నులుముకొని మరిమరీ చూచాడు. అప్పుడు అంతా స్పష్టంగా తెలిసిపోయింది.

ఒక చిన్న గది—అందులో తానున్నట్టు గ్రహించాడు. "ఇంతకు కొంచెంముందు నేనెక్కడ ఉండినాను? నిప్పంటుకొన్న డేరాలో—కాలుగాలిన పిల్లిలా తిరుగుతూ ఉండినాను. ఇప్పుడో? నిప్పు లేదు; డేరాకూడ లేదు; ఆ ఏడ్పులూ ఆ పెడబొబ్బలూ లేవు. ఇనుప కటకటాలువేసిన ఒక కొట్టులోనేనున్నాను. ఒకే నిశ్శబ్దంగా ఉంది. ఇక్కడికి ఎట్లా వచ్చాను?" తిమ్మన్న కేమీ తోచలేదు. బయటికి పోయి చూద్దామా? తిమ్మన్న తలుపుదగ్గరకు వెళ్లాడు. ఏమిటి? బయట తాళంవేసిపెట్టారా? అవును, బయటికి పోవడానికి వీలులేదు.

తిమ్మన్న మళ్లీ వెనుకకూర్చున్న చోటికే వెళ్ళి కూర్చున్నాడు. నేను ఇక్కడికి ఎట్లా వచ్చాను? ఎప్పుడు వచ్చాను? ఎవ

రితో వచ్చాను ? యోచనచేసి చూశాడు. ఏంతోచలేదు. మైకం కమ్ముకొనేముందు కడసారిగా ఏంజరిగింది ? అది తటాలున అతని మనసుకు తోచింది. గభాలున నలుగురు ఎదుటికివచ్చారు. ఒక మొరటు ఆసామి తిమ్మన్న ముక్కుమీద ఒక గుద్దువేసి గట్టిగా నొక్కిపట్టాడు. తక్కినముగ్గురూ వెనుకనుంచి చేతులు పట్టు కొన్నారు. తరువాత జరిగిందేమీ అతనికి జ్ఞాపకం రాలేదు.

కాని ఒక్కటిమాత్రం తెలిసింది. "నేనిప్పుడు పగవారి చేతుల్లో దొరుక్కొన్నాను. మత్తుమందు వాసనచూపించి వారు నన్నిక్కడికి తీసుకొనివచ్చి ఈగూటిలో బంధించి ఉంచారు. ఎవరు నాకు శత్రువులు ? ఎవరికీ నేను ద్రోహంచెయ్యలేదే ? ద్రోహం చెయ్యందే పగఎందుకు వస్తుంది ? ఏమో, నాకు పగవారున్నా రన్నమాటే ! వారి ఉద్దేశ్యమయినా ఏమిటో ?

తిమ్మన్న దీర్ఘంగా ఆలోచించాడు. అప్పుడు ఎదురుగ్గా ఒక మనిషి వస్తున్నట్టు అతినికి చూచాయగా తెలిసింది. వాడు తలుపు ఓరగా వచ్చినిలుచున్నాడు. ఎవడు వాడు ? కాళప్ప ! అవును. వాడే !

"ఒరే తిమ్మన్నా, నేనెవరో నీకు తెలుసుగదూ ! నీవు నన్ను ఎంత అలక్ష్యంగా చూచావు ? ఇప్పుడైనా తెలిసిందా, నాతో చెర్లాట ఎంతప్రాణసంకటమో !" అని వాడు గర్వం ఉట్టిపడే గొంతుతో గట్టిగా అడిగాడు.

"అయితే, నీవేనన్నమాట నన్ని గతిపట్టించింది. సరిసరి, ఇప్పుడు నాకు తెలిసిపోయింది. ఒక్కటిమాత్రం నేనడుగుతాను. నేను నీకేం ద్రోహంచేశాను."

"ఏంద్రోహం చేశావో నీకు తెలియదూ ? అయితే, చెబుతా విను. నీవూ, నీ స్నేహితులూ నాకంపెనీలో చేరండని నేనడగడం జ్ఞాపకముందా ? అప్పుడు నీవు నాకు కొంచెమైనా మర్యాద చూపించావా, చెప్పు !"

"ఎలా చూపిస్తాను? మీరు మా ప్రియమైన యజమానికి ద్రోహం చేసినవారుకదూ! కాళప్పా, నీవు కక్షకట్టుకొని ఆయన కంపెనీని పడగొట్టడానికి చేసిన కుట్రమరచిపోయావా? చివరకు ఆయన ప్రాణానికే కుంపటిపెడితివే! అటువంటి నీతో నాకు ఎలాటి సంబంధమూవద్దు."

"సరి. ఆనాడు నీవు చెప్పినట్లేజరిగింది. ఇంక, నేను చెప్పినట్లే జరుగుతుంది. అదినాకు గట్టిగా తెలుసు. నీవు నామాటప్రకారం నడుచుకోవాలి. నడుచుకోనంటావా, నడుచుకొనేటట్లు చేస్తాను. అందుకు తగినశక్తి నాకుంది," అంటూ కాళప్ప బిగ్గరగా నవ్వాడు.

"శక్తియా! అదేంశక్తి? కొంచెం తెలిసేటట్లన్నా చెప్పరాదూ?" తిమ్మన్న అలక్ష్యంగా అడిగాడు.

"అంతగా తెలుసుకొందామనిఉంటే, తప్పక చెబుతాను, విను. నీవు ఈ చెరనుంచి బయటపడాలంటే, ఒక్కటే మార్గముంది - అది నేను చెప్పినట్లు నీవు నడుచుకోవడమే! నడుచుకోకపోతే...? ఇక్కడే నీకు చావు మూడుతుందనుకో!" అని కాళప్ప కచ్చితంగా చెప్పివేశాడు.

తిమ్మన్న స్తంభించిపోయాడు.

"చావు ఎలా మూడుతుందంటావా? ఉండు, ప్రత్యక్షంగా చూపిస్తా...ఒరే గంటయ్యా, ఆ సామాను ఇలా తీసుకురా!" అంటూ బిగ్గరగా ఒక ఉత్తరువువేశాడు కాళప్ప. మరుక్షణంలో అక్కడ ఒక ఆసామి ప్రత్యక్షమైనాడు. తనకు మందువాసన చూపించి మత్తులోపడేశాడే ఆ భడవాయే! వాడు చేతిలోపట్టుకొచ్చింది ఒకతుపాకి!

కాళప్ప తుపాకి తీసుకొన్నాడు. దానిని కటకటాల మధ్యగా లోపలికి జొనిపి తిమ్మన్నకుసూటిగా గురిపెట్టాడు. తిమ్మన్న గడగడ లాడిపోయాడు. కండ్లు కట్టిగామూసుకొన్నాడు.

"ఇప్పుడు నిన్ను చంపనులే! బతికిబయటపడి బాగుపడాలని ఉందా? ఉంటే, నాకంపెనీలోచేరాలి. చేరకపోతేనా...?

ఇదిగో ఈతుపాకితోనే నిన్ను కాల్చివేస్తాను. ఈనాటినుంచి రెం. వారాలు నీకు గడువిస్తాను. ఈ గడువులోపల గనక నీవు మర దగా సమ్మతించకపోతే, కడపటిదినం రాత్రి సరిగ్గా పన్నెండుగం లకు నిన్ను తుపాకితో కాల్చివెయ్యడం ఖాయం," అని హెచ్చరి: చెప్పి, తుపాకి గంటయ్య చేతికిచ్చివేసి కాళప్ప వెళ్ళిపోయాడు.

"ఒరేయ్, తిమ్మన్నా! నీ సామర్థ్యమంతా మూటకట్టిపెట్టు. కాళప్పగారి దగ్గరా, నాదగ్గరా నీ యాటలుసాగవు. ఇక్కడనుంచి తప్పించుకొని పోవచ్చునని చూస్తున్నావేమో! కలలోకూడా అది అనుకోవద్దు. అది జరగనిపని. నేనెవరో తెలుసా? గంటయ్య! బోధ పడిందా?" అంటూనే వాడూ కదిలిపోయాడు-తుపాకితోసహా.



తిమ్మన్న మనస్సు మహామథన పడిపోయింది. మృత్యువునోరు తెరుచుకొని ఎదురుగా వచ్చి నిలిచింది. తాను ఏ నేరమూ ఎరగడు. మృగాలసర్కస్సుకంపెనీ ఆరంభించిందొక్కటే తనతప్పు - కాళప్ప లెక్క ప్రకారం. డేరా నిప్పంటుకొని నాశమైపోయింది. ఇంతకూ ఎలాగు? కాళప్పే ఈగంటయ్యచేత నిప్పుపెట్టించి ఉంటాడా? అదే గనక నిజమైతే, వారు మనుషులేనా? పిశాచాలుకదూ! తన ప్రియమైన సహచరులు-ఆ మృగాలన్నీ ఏమైపోయాయో, ఎక్కడ ఉన్నాయో! డేరా మండిపోయేటప్పుడు వారు ఎక్కడఉన్నారో! పాపం! లేక ఆమంటల్లో చిక్కుకొని మాడిపోయారో! ఛా ఛా! శాంతం పాపం! తప్పించుకునే ఉంటారు. తప్పించుకొనే ఉంటే, ఇప్పుడు ఎలా ఉంటారో! ఏం చేస్తుంటారో! నేను కనబడనందుకు ఏమనుకొంటారో! - ఇలా తిమ్మన్నమనసులో ప్రశ్నలపై ప్రశ్నలు లేచాయి. అన్నీకూడ జవాబు దొరకని ప్రశ్నలే!

కాళప్ప కంపెనీలోచేరితే...? ప్రాణాలు కాపాడుకోవచ్చు. తానుచేరితే తక్కిన మృగాలూ చేరుతాయి. వాళ్లూ బతికిపోతారు.

ఛీ ఛీ! ఏమిటీ పాడుయోచన! గోవిందరావుమాష్టారు ఆత్మకు ద్రోహం చెయ్యడమా? అంతకువస్తే, అది ఈవరకే చేసి యుండవచ్చునే! ఇన్నికష్టాలు పడవలసిన అక్కరే ఉండేదికాదే!

కలతపడియుండిన తిమ్మన్నమనస్సు క్రమక్రమంగా కలక దేరింది. "ఊహూం. యజమానికి ద్రోహంచేసినవానితో చేరను గాక చేరను. చావువస్తే రానీ. ఇటువంటిచావు నిజంగా చాలా మంచిదే!" తిమ్మన్నకు ధైర్యం పుట్టుకొనివచ్చింది; మనస్సు దృఢ పడింది. కాళప్ప తనను కాల్చిపారేస్తాడు. వేస్తేవేయనీ. నాశ మయ్యేది దేహమేగా! ఆత్మ నాశంకానేకాదు. ఎటువంటి పగ వాడూ ఆత్మను నాశంచెయ్యలేడు.

"అయ్యా, ఇదిగో అన్నం, పులుసూ. భోంచేయి!" అన్న ఒక పసివాడిగొంతు తిమ్మన్నను ఆదీర్ఘాలోచననుంచి తట్టిలేపింది.

కటకటాల మధ్యనుండి రెండు చిన్నారిచేతులు లోపలికివచ్చాయి-అన్నం కంచంతోసహా. "నేను తర్వాత సావకాశంగా వస్తాను. అదిగో దూరంగా గంటయ్యచూస్తూ నిలుచున్నాడు. నేను నీకు శత్రుకోటిలోనివాణ్ణికాను; మిత్రకోటిలోనివాణ్ణే!" అని చెప్పి ఆకుఱ్ఱ వాడు తుఱ్ఱున వెళ్ళిపోయాడు.

'కుఱ్ఱవాడు చెప్పింది నిజమే అయివుంటుందా?' అన్న సందేహం తిమ్మన్నకు పట్టుకుంది. వాడేమైనా వేషం వేస్తున్నాడేమో! లేక ఇదేదైనా కుట్రకు పథకమో!

రెండుమూడు దినాలు గడిచాయి. ఈలోపల తిమ్మన్నకు తెలిసిపోయింది—తాను మొదట్లో తలచిందంతా తప్పని. గంటయ్యలేనిసమయం చూచుకొని రాముడు వచ్చేవాడు. తనకష్టాలన్నీ చెప్పుకొనేవాడు. గంటయ్య ఇల్లు వాడికి నరకప్రాయంగా ఉన్నట్టూ, అందులోనుంచి బయటపడే మార్గం దొరకక వాడు మహాబాధ పడుతున్నాడనీ తిమ్మన్న గ్రహించాడు. తిమ్మన్న రాముని ముఖం తేరిపార జూచాడు. అందులో దుఃఖం కరడుగట్టుకొనిపోయి ఉండడం కండ్లారా కనిపెట్టాడు. మోసం రేఖామాత్రంగానైనా అందులో అతనికి గోచరించలేదు. చిన్నతిమ్మన్నమీద ఉండే అభిమానం తిమ్మన్నకు రామునిమీదకూడ ఏర్పడింది. అలాగే రామునికిగూడ సొంత అన్నమీద కలిగే అభిమానం తిమ్మన్నమీద ఏర్పడింది. స్నేహపాశం ఆ యిద్దరినీ బాగా కట్టివేసింది.

తిమ్మన్న రామూను ఇదివరకు ఎరగడు. కాని, రాముడు తిమ్మన్నను ఎరుగును. ఇదివరకొకసారి తాను చాటుగా మృగాల సర్కస్సుకు వెళ్లివచ్చిన సంగతి వాడింకా మరచిపోనేలేదు. ఆ సర్కస్సు మేనేజరు తాను నివసించే యింటిలో ఖైదీగా చిక్కుకొంటాడని వాడు కలలోకూడ అనుకోలేదు. కాని అది జరగనే జరిగింది. రాముడు చాలా దుఃఖించాడు.

"మీ సర్కస్సు చూచేటప్పుడు సాక్షాత్తూ స్వర్గంలో ఉన్నట్టే ఉడింది. నాకు మీ సర్కస్సు అంటే ఎంత ఆశో తెలుసా?

నాకూ కొన్ని విద్యలు తెలుసు. కాని అవి ఏవీ ఇతరులు నేర్పిన బాపతు కాదు. తోచింది తోచినట్టు నేను స్వయంగా సాధన చేసి నేర్చుకొన్నవే! నా విద్యల్లో కొన్నిటిని నాదగ్గర ఉండిన ఒక మృగానికి నేర్పనుగూడ నేర్పాను. మీరొకసారి 'ఊరమృగాలు కావాలి' అని ప్రకటన చేశారు చూశారూ? అప్పుడు నేను దాన్ని మీవద్దకు పంపించాను. ఆ తర్వాత దాని చహరాయే తెలీలేదు. పాపం, ఇప్పుడది ఎక్కడఉందో మరి, నా ప్రియమైన ఆ వెల్లయ్య ఏమై పోయాడో ఏమో!''

''ఓహో! ఆ వెల్లయ్యా? తలకిందులుగా నిలుచుకొని తమాషా తమాషా ఆటలు ఆడుతుంటాడే, వాడేనా నీ శిష్యుడు! అవును. వాడు ఒకసారి చెప్పనుకూడ చెప్పాడు 'రాముడనే ఒక అబ్బాయి తన కీవిద్యలు నేర్పా'డని. ఆ రాముడివి నువ్వేనా బాబూ!'' అంటూ కటకటాలగుండా చేతులుచాచి రామున్ని తడవి తడవి బుజ్జగించాడు.

తిమ్మన్నకు పెట్టిన గడువులో ఒకవారం గడిచింది. ఆరోజున కాళప్ప మళ్ళీ వచ్చాడు. ''ఒరేయ్ తిమ్మన్నా, ఏమాలోచించావు మరి! బతికి బయటపడి బాగుపడతావా? లేక యమలోకం పోతావా? ఏం తీర్మానం చేసుకొన్నావు?'' అని నిలవదీసి అడిగాడు.

తిమ్మన్న బదులు చెప్పలేదు. ''ఏమిరోయ్ తిమ్మన్నా! అడుగుతూంటే జవాబు చెప్పవేం? నిన్నుగాదూ అడిగేది? నా కంపెనీలో చేరతావా, లేదా? ఇంకొక వారమే గడువుంది,'' అని కాళప్ప జ్ఞాపకపరిచాడు.

''తీర్మానాని కేమిఉంది? ఒకటే తీర్మానం. చావడానికి తయారు!'' అని గంటయ్య హేళనగా అన్నాడు.

''బలే! నీ నోట్లో చక్కెరపొయ్యాలి! నేనూ అంతే అనుకొన్నాను. నీవూ అదే అన్నావు! అవును, నేను చావడానికే నిశ్చ

యించాను. నేను మీ కంపెనీలో చేరను గాక చేరను. నేనేకాదు; నా సహచరులూ చేరరు. మా ప్రియమైన యజమానికి ద్రోహం చేసినవారు కదూ మీరు! మీతో మాకు ఎట్టి సావాసమూ వద్దు. నన్ను భేషుగ్గా చంపివేయండి. సంతోషంతో చస్తాను. ఇక ఈ విషయమై నాతో మాట్లాడనేవద్దు. నేనూ మీతో మాట్లాడను. మీతో మాట్లాడితే నా నాలుక అపవిత్రమైపోతుంది కూడాను,'' అని తిమ్మన్న ధైర్యంగా చెప్పివేశాడు.

''ఏమిటేమిటి? అంతధైర్యం వచ్చివేసిందేం? ఆ ధైర్యమేపాటిదో కాల్చే టప్పుడు చూడకనే పోతానూ?'' అంటూనే కాళప్ప వెళ్లిపోయాడు. గింటయ్యా అతనిని వెంబడించాడు.

ఇక ఉన్నదేమో ఒకే వారం. ఆ తర్వాత ఏమయ్యేదీ తిమ్మన్నకు బాగా తెలుసు! ఆ తర్వాత తన సహచరు లేంచేస్తారు? తిమ్మన్నకు తననుగురించి యోచనేలేదు. అతని యోచనంతా తన సహచరులను గురించే. దిక్కులేని ఆ అనాథ మృగాలను తలచుకొని తిమ్మన్న మనస్సుకరిగిపోయింది. చచ్చేముందు వారి నొక్కసారైనా చూడాలి. కాని ఆ ఆశ నెరవేరుతుందో లేదో! తిమ్మన్న వెక్కి వెక్కి ఏడ్చాడు.

''తిమ్మన్నా, దుఃఖపడవద్దు!''—అంటూ ఒక ఆడగొంతు వినిపించిది. తిమ్మన్న కండ్లు తుడుచుకొన్నాడు. బయటికి చూచాడు.

కటకటాల దగ్గర ఒక ముడుకాళ్ల ముసలమ్మ నిలుచుకొంది. దగ్గరనే రాముడుగూడ ఉన్నాడు. ఆ ముసలమ్మను గురించి రాముడు చాలాసార్లు తిమ్మన్నకు చెప్పాడు.

''తిమ్మన్నా, నీవేం చీకూ చింతా పెట్టుకోకు, నీవు తప్పించుకు పోవడానికి ఒక మార్గముంది. ప్రయత్నించి చూద్దాం. అందుకే ఇప్పుడు నేను వచ్చింది. ఇవాళ గంటయ్య ఇక్కడలేడు,'' అని చెప్పింది ముసలమ్మ.

ఏమిటి! తప్పించుకోవడానికి మార్గముందా? కారుచీకట్లో ఒక వెలుగు రేఖయా! తిమ్మన్న లేచికూర్చున్నాడు. అతడి ముఖంలో వికాసచిహ్నాలు గోచరించాయి.

"తిమ్మన్నా, నేను అంతా గమనిస్తూనే ఉన్నాను. గంటయ్య సత్తుక బంటి పాపంలో మునిగిపోయి కూర్చున్నాడు. వాడు గట్టెక్కడం మాటకల్ల. వాడి పాపం నిన్నుకూడ నాశంచేస్తుంది. దానిని నేను చూస్తూ ఉండలేను," అని ముసలమ్మ మళ్ళీ చెప్పింది.

తిమ్మన్న ముసలమ్మ ముఖం తేరిపార జూచాడు. ఆవిడ ఒక దేవతామూర్తేమో!

"సరి. నీ సహచరులకు వెంటనే ఒక జాబు వ్రాయి. 'నేను గంటయ్య ఇంటిలో చిక్కబడిపోయాను. ఇంకొక వారమే గడువుంది. అది తీరిపోగానే కాళప్ప తుపాకితో నన్ను కాల్చిచంపేస్తాడు,' అంటూ ఇదంతా నీవు అందులో వ్రాయాలి," అని ముసలమ్మ చెప్పింది.

"వ్రాస్తాననుకో, వ్రాసి ఏంలాభం? అది నా సహచరులకు ఎలా చేరుతుంది? చేరినా, వాళ్ళు ఎలా ఇక్కడికి రాగలరు? వచ్చారు పో, వాళ్ళేం చేయగలరు?—మొదలైన అనేకప్రశ్నలు తిమ్మన్న మనస్సులో తలఎత్తాయి. అవన్నీ గ్రహించినట్లే "తిమ్మన్నా, ఆ యోచనలన్నీ తర్వాత చేసుకొందాం. ముందిప్పుడు వెంటనే జాబువ్రాయి. ఊం. త్వరగా. ఆట్టే పొద్దులేదు," అని ముసలమ్మ ఒకటే పోటుకులు పెట్టింది.

రాముడు ఒక పెన్సిలూ, కాగితం లోపలి కందించాడు. తిమ్మన్న కొంచెంసేపు కూర్చొని ఏదేదో వ్రాశాడు. తర్వాత దానిని మడిచి ముసలమ్మచేతికిచ్చాడు.

రాముడు ఒక కేకవేశాడు. వెంటనే వాడి తెల్లపావురం అక్కడికివచ్చి వాలింది. రాముడు ఆ జాబును ఇంకా చిన్నదిగా మడిచాడు. ఒక చిన్నదారం తీసుకొని దానితో ఆ జాబును పావురం



కాళ్లకు కట్టాడు. తర్వాత పావురం చెవుల్లో ఏదేదో ఊదాడు. విహంగం రివ్వున ఎగిరిపోయింది. అది మరుగుపడిపోయేవరకూ ముసలమ్మా, రాముడూ, తిమ్మన్నా దానిని వింతగా చూస్తూ అలాగే నిలుచున్నారు.

ముసలమ్మ ప్రయత్నం ఏమైనా ఫలిస్తుందా? సందేహమే! ఒక వారమేగా గడువుండేది! గడువు పూర్తికాగానే...? తలచుకోవడానికి కూడ తిమ్మన్నకు భయంగా ఉంది. ఒకవేళ ఈ ప్రయత్నం ఫలిస్తే...? తాను బతికి బయటపడడానికి కారణమైన వారెవరౌతారు? ముసలమ్మ, రాముడు—ఇద్దరే! తనకు సాయం లభిస్తుందనీ, మంచివారుకూడ ఉంటారనీ అతడు పూర్తిగా మరచిపోయి ఉండినాడు. ఆ ఆశలు పేరాసలనుకొన్నాడు. కాని ఇప్పుడు ఆ అభిప్రాయం శుద్ధ పొరబాటని అతనికి తెలిసిపోయింది. ఎన్నడూ

ఎదురుచూడనివారు, ఎదురుచూడనివేళలో, ఎదురుచూడని విధంగా సాయపడుతుంటారు.

"ఒరేయ్ తిమ్మన్నా, నిన్నటితో ఒకవారం ముగిసింది. ఇక ఉన్నది ఆరే ఆరునాళ్ళు. తెలుసా?" అంటూ మరుసటిరోజు తెల్లవారే సరికల్లా తయారైనాడు గంటయ్య.

తిమ్మన్న జవాబు చెప్పలేదు.

"ఏమిరోయ్, అడుగుతూ ఉంటే జవాబు చెప్పవ్? నీకేం నోరు పడిపోయిందా?" అని గంటయ్య మళ్లీ ఘాటుగా అడిగాడు. దానికీ జవాబు లేదు.

"వద్దు రావద్దు. నీవేం బదులు చెప్పవద్దు. ఇప్పుడు నీవేమీ నాలుక ఆడించవద్దు. అయితే, ఆనాడు మరి ఆడించకతప్పదు. తెలుసుకో!"

వచ్చే శనివారం రాత్రి పండెండుగంటలకు కాళప్ప వస్తాడు; తుపాకి తీసుకొని కాలుస్తాడు; మరణవేదనలో తిమ్మన్న నాలుక బయట పెట్టకతప్పదు. దానినే గంటయ్య ఈ మాటలతో ఎత్తి పొడిచాడు.

"ఒరే తిమ్మన్నా, నిన్ను కాల్చిచంపేది కాళప్పగారు; నేను ఎంతో వేడుకొన్నాను-నిన్ను నా చేతులారా చంపనిమ్మని. కాని ఆయన ఒప్పుకోలేదు. నిన్ను ఆయనే స్వయంగా చంపాలట. పోతే పోనీ. నీ తమ్ముడొకడు ఉన్నాడుగదూ, చిన్నతిమ్మన్న! వాణ్ణి చంపుతానులే నేను, నా చేతులారా!" అని చక్కాపోయాడు.

తిమ్మన్న తమ్ముణ్ణిగురించి కలవరపడ్డాడు. కండ్లనిండా నీళ్ళు పెట్టుకొన్నాడు.

## 9

"తిమ్మన్న లేకపోయినంతమాత్రాన కొత్త సర్కస్సుకంపెనీ ఆరంభించగూడదా ఏం? మంచిన్యాయమే!" అని మూతి విరిచింది ఒకటోనంబరు ఒంటె.

‘‘జంబూ లేడూ ? వాడు చాలడూ ? జంబూయే మానేజరుగా రానీ! ఫస్ట్‌క్లాసు సర్కసుకంపెనీ ఆరంభిద్దాము. అది వెనుకటిదాని కంటేకూడ భేషుగ్గా నడుస్తుందో లేదో చూద్దాం!’’ అని తౌడయ్య అందుకొన్నాడు. ఒంటెలు దానికి ఆమోదించాయి.

‘‘పనికిమాలిన మాటలు మాట్లాకండి. మనకు అసలు సర్కసు విద్యలు నేర్పినవాడు తిమ్మన్న. కంపెనీ ఆరంభించిందీ, అమోఘంగా నడిపిందీ ఆయనే. జంబూ కాదుగదా, మరెవ్వరూకూడ ఆకంపెనీని నడపలేరు, ఏమనుకొన్నారో!’’ అని సింగన్న ఒక్కదూకున ముందుకువచ్చాడు. అతనిమాటల్లో కొంచెం కోపంకూడ ద్యోతక మయింది.

‘‘మీకు జంబూ శక్తి సామర్థ్యాలు తెలియవన్నమాట! అవి చూపడానికి అతని కింతవరకూ అవకాశం చిక్కిందెక్కడ? ఆ అవకాశమే దొరకనీండి, అప్పుడు మీకే తెలుస్తుంది, తిమ్మన్న కన్నా జంబూ గట్టివాడో కాదో. అవునా, కాదా జంబూ ?’’ అని చల్లయ్య సవాలుచేశాడు.

జంబూ జవాబు చెప్పలేదు. ముసిముసి నవ్వులు విసురుతూ నిలుచున్నాడు.

‘‘అదీ సరేకావచ్చు. కాని, అసలు ఇప్పుడు తిమ్మన్నే కన బడలేదే! ఆయన ఎక్కడఉన్నాడో వెదకి కనిపెట్టడం మన ధర్మం కదూ! లేకుంటే నలుగురూ మనల్ని ఏమనుకొంటారు? వట్టి కృత ఘ్నులనుకోరూ?’’ అని మధ్యస్థంగా వచ్చి సలహా యిచ్చాడు గజేంద్రుడు.

జంబూ ఏదో భావయుక్తంగా చల్లయ్యవంక చూచాడు. అది గ్రహించి ‘‘తిమ్మన్న కనబడలేదని దిగులుపడడమెందుకు ? అత గాడి యోగ్యతమాకు తెలిసిపోయింది. మనల్ని ఇక్కడ అయోమయావస్థలో పడేసి, తాను రహస్యంగా కాళప్పను చూడడానికి పోయాడు. కాళప్ప సర్కసులో ఉద్యోగం చూచుకొందామని ఎత్తు.

ఇదంతా ఎవరికీ తెలీదని కొంతమంది అభిప్రాయం," అని చల్లయ్యా గుట్టు బయటపెట్టాడు.

ఇదివిన్న సింగన్నకు అరికాలిమంట నెత్తికెక్కింది. కోపం పొంగిపోయింది. ఆ కోపంలో జూలు రెపరెపలాడింది. కళ్లల్లోనుంచి నిప్పురవ్వలు వెలువడ్డాయి. దిక్కులదిరేటట్టు ఒక భయంకర గర్జన చేశాడు. చిన్నతిమ్మన్న, ఇంతరాద్ధాంతం జరుగుతున్నా కూడ బెల్లం కొట్టిన రాయిలా కూర్చున్నవాడల్లా ఇప్పుడు ఒక్క విసురునవచ్చి సింగన్నముందు వాలాడు. సింగన్న దాడీపట్టుకొని ఒక్కసారి ఊపాడు. "ఏదీ నూరువరకూ అంకెలు లెక్కపెట్టు. ఊఁ. కానీమరి. చదువుకొన్నదల్లా చల్లగా మరచిపొయ్యావా?" అని జ్ఞాపకపరిచాడు. సింగన్న చెంపలు వేసుకొన్నాడు. వెంటనే ఒకటి, రెండు... అని లెకపెట్టడం మొదలెట్టాడు. యాభైయేపో అంకెకు "చిన్న తిమ్మన్నా, నాకోపం అణిగిపోయిందోయ్!" అన్నాడు.

ఆమృగాల్లో రెండుకక్షులు ఏర్పడ్డాయి. జంబూ, తౌడయ్యా, చల్లయ్యా, ఒంటెలూ ఒకకక్షి. చిన్నతిమ్మన్న, గజేంద్రుడు, సింగన్న, నల్లయ్యా, పల్లయ్యా, గుఱ్ఱాలూ ఇంకొకకక్షి. మరి, క్రొత్తగా వచ్చిన మృగాలో? వాటికేంతెలుసు, మంచిదేదో, చెడ్డదేదో! వాటిలోకొన్ని జంబూకక్షిలో చేరాయి; తక్కినవి చిన్నతిమ్మన్న పక్షం వహించాయి.

ఆ పాపిష్ఠి అగ్నిప్రమాదం సర్కస్సు డేరానే కాదు; సర్కస్సు మృగాల్లోని ఐకమత్యాన్నిగూడ నాశనం చేసివేసింది!

పల్లయ్యా, చల్లయ్యా ఇన్నాళ్లూ పరమస్నేహితులు. ఇప్పుడో పరమశత్రువులు. చల్లయ్యను చూస్తేసరి, పల్లయ్య పొడుగాటి కోరలు ఒక్కఊపున ముందుకు పొడుచుకొని వస్తాయి. పల్లయ్యను చూస్తే చల్లయ్యకూ అలాగే మండిపోతుంది. అసలే ఉబ్బుడు ముఖం మరింత ఉబ్బిపోతుంది. ఒక ఎలుగు చెప్పింది ఇంకొక ఎలుగు చస్తే వినదు. ఒకరితో ఒకరు పలక్కుండా ఉండడమే మంచి దేమో అనిపించే పరిస్థితి ఏర్పడిపోయింది.

ఒంటెలకూ, గుఱ్ఱాలకూ మధ్య ద్వేషం పెరిగిపోయింది. ఆ నాడు ఒంటెలొకవైపూ, గుఱ్ఱాలొకవైపూ బారులుతీరి నిలుచుకొన్నాయి. ఒకటి కొకటి తన్నుకోవడం, గుద్దుకోవడం, ఢీకోవడం, కొరుక్కోవడం ఆరంభించాయి. ఆ గలాటా విని చిన్నతిమ్మన్న పరుగెత్తివచ్చాడు. ఆ రెండు జట్లమధ్యా దూరినిలుచుకొని వాటికుమ్ములాట ఆపడానికి చూచాడు. కాని వాడికి సాధ్యం కాలేదు. అలా మధ్యంతరంగా నిలుచుకొనే "గజేంద్రా, సింగన్నా దబ్బునరండి," అని కేకలువేశాడు. వాళ్ళు ఉరుకులమీద వచ్చారు. సింగన్న సింహనాదంచేస్తూ మధ్యలోకి దూకాడు. గజేంద్రుడు తొండం విసురుగా అటూ ఇటూ ఆడిస్తూ బ్రహ్మాండ ప్రయత్నంమీద వాటిని విడదీసి, ఆ కుమ్ములాటను ఆపించాడు. అబ్బబ్బా! వాటిని విడదీయడానిని ఎంతెంత శ్రమపడవలసి వచ్చింది!

కట్టువిప్పిన కట్టెలలాగా అయిపోయారు వాళ్ళు. ఇక మఠాన్ని కాపాడడానికి చిన్నతిమ్మన్న తన చేతనైనంతా పాటుపడ్డాడు. కాని, సాధ్యపడలేదు.

అన్నయ్యనుగురించిన వ్యాకులం అతన్ని గట్టిగాపట్టుకొని బాధిస్తున్నది. ఆయన ఎక్కడపోయినట్టు? ఎవరైనా కుట్రచేసి మాయంచేశారా? అయితే ఆపని ఎవరుచేసి ఉంటారు? లేక ఆయనంతట ఆయనే వెళ్లిపోయాడా? పోతే, తనతో ఒక్కమాటయినా చెప్పకుండా ఎందుకుపోయాడు? చిన్నతిమ్మన్నకు కొన్ని అనుమానాలు కలిగాయి. కొందరు కొందరిమీదకూడ సందేహాలు ఏర్పడ్డాయి. కాని సందేహాలనుగురించి ఎవరితోనూ అనకూడదు. మనస్సులో ఉంచుకోవలసిందే!

తిమ్మన్ననుగురించి ఎట్టి భోగట్టాకూడ తెలియలేదు.

ఒకనాడు జంబూ తనజట్టువారందరినీ పిలిచి, "నేను ఒక ముఖ్యమైన పనిమీద ఒకచోటికి పోతున్నాను. తిరిగిరావడానికి ఎనిమిది పది దినాలుపట్టవచ్చు. ఈలోపల కొన్ని ముఖ్యమైన వ్యవ

హోరాలు జరిగిపోతాయి. మీరెక్కడికీ వెళ్ళకండి. నేను వచ్చేటంత వరకూ కాచుకొని ఉండండి,'' అని చెప్పాడు.

''జంబూ ఎక్కడికి పోయింది? ఎందుకు? '' అని చిన్న తిమ్మన్న ఒంటెలను అడిగాడు. అవి ''మాకు తెలియ'' దన్నాయి.

ఆనాడు చిన్నతిమ్మన్నా, అతని జట్టువారు ఒక చెట్టుకింద కూర్చున్నారు. తిమ్మన్ననుగురించే మాట్లాడుకొంటున్నారు. ఇంకొక జట్టు వారు అప్పుడు అక్కడ లేరు.

సరిగ్గా ఆవేళకు ఒక తెల్లపావురం ఎక్కడనుంచో అక్కడికి వచ్చి వాలింది. మెల్లగా చిన్నతిమ్మన్న చెంత జేరింది. చిన్నతిమ్మన్న దానిని నిగాగా చూచాడు. దానికాళ్ళకు కట్టిపెట్టిన కాగితం మడత కంటబడింది. చిన్నతిమ్మన్న పావురాన్ని తీసుకొని ఒళ్లోకూర్చొ బెట్టుకొన్నాడు. వణుకుతున్న వేళ్లతో ఆకాగితం మడత విప్పి విడ దీశాడు. ఆత్రంగా దాన్ని చదివాడు;

''నా ముద్దులతమ్ముడూ, నన్ను కాళప్ప ఇంట్లో చెర బెట్టారు. వచ్చే శనివారం రాత్రి పండెండు గంటలకు కాళప్ప నన్ను తుపాకితో కాల్చి చంపేయబోతున్నాడు. ఈ పావురం మీకు దారి చూపుతుంది. వీలైతే రండి. వీలుపడకపోతే విచారపడకండి. నా తలరాత!—అంతతోనే ఊరడిల్లండి. ఇంకొక లోకంలో మళ్ళీ కలుసుకుందాం.

ఇట్లు,
మీ ప్రియమైన అన్న
"తిమ్మన్న"

జాబు చిన్నతిమ్మన్న చేతినుండి అట్లే జారిపడిపోయింది. దానితోపాటు అతగాడూ దబుక్కున్న కింద పడిపోయాడు. గజేంద్రుడు చెంతనే ఉన్న కాలవలోకి తొండం జాపాడు. గబగబా నీళ్లు పీల్చాడు. వాటిని చిన్నతిమ్మన్న ముఖం పైన చిమ్మాడు. తక్కిన వాళ్లు చేతికి చిక్కిన చెట్లమండలుతీసుకొని విసిరారు.

"అన్నయ్యా, అన్నయ్యా!" అని గావు కేకలు వేస్తూనే చిన్న తిమ్మన్న కండ్లు తెరిచాడు. వెంటనే వలవల ఏడవడం మొదలు పెట్టాడు. వాణ్ణిచూచి తక్కినవాళ్లూ కంట నీళ్ళు పెట్టారు.

తటాలున చిన్నతిమ్మన్న ఏడుపు చాలించాడు. గబుక్కున లేచి నిలుచున్నాడు. "సహచరులారా, ఇదిగో నేను పోతున్నాను. నల్లయ్యా, పల్లయ్యా, వెల్లయ్యా ముగ్గుర్నీ నావెంట రానియ్యండి. తక్కిన వారందరూ మాకోసం ఎదురుచూస్తూ ఇక్కడే ఉండండి. త్వరలోనే మళ్ళీ కలుసుకొందాం—ప్రాప్తముంటే!" అన్నాడు. ఆ మాటలు వినేసరికి నల్లయ్యకూ, పల్లయ్యకూ, వెల్లయ్యకూ ఎంత ఆనందం తెలుసా? తక్కినవారి ముఖాలు తటుక్కున వాడి పోయాయి. వారికిగూడా వెంటపోవాలని చాలా ఆశ. చిన్నతిమ్మన్నతో మొర పెట్టుకొన్నారు.

"అందరూ కట్టకట్టుకొనిపోతే అసలుకే విఘాతం ఏర్పడవచ్చు. సింగన్నా! ఈ పని నీ చేతకాదు. ఇదివరకొకసారి నీవు నవ్వుల బంగారు బానకు కావలివున్నావు. ఏమయింది?" అని చిన్నతిమ్మన్న సింగన్నకు అడ్డుచెప్పాడు. సింగన్న సిగ్గుతో తలవంచుకొన్నాడు. ఆపైన అతగాడు హఠం చెయ్యలేదు.

"గజేంద్రా, చెప్పినమాట విని నీవూ ఇక్కడే ఉండిపో. దారిలో అడుగడుగుకూ ఒదిగి ఒదిగి దాచిపెట్టుకోవలసివుంటుంది. నీది భారీశరీరం. ఎలా దాక్కోగలవు?" అని చిన్నతిమ్మన్న గజేంద్రుణ్ణి సమాధానపరిచాడు. గజేంద్రుడుకూడ అదీ నిజమే ననుకొని 'సరే' నన్నాడు.

పావురం బయలుదేరింది. చిన్నతిమ్మన్నా, తక్కిన ముగ్గురూ దాని వెనకాలే బయలుదేరారు. అది ఆకాశానా, వీరు భూమి మీదా! పావురం అడ్డుదారిపట్టి పోతున్నది. పగటిపూట దారి పక్కల దాచిపెట్టుకొంటూ, రాత్రిపూట నిర్విచారంగా ప్రయాణం సాగిస్తూవచ్చారు. ఎవరికీ తిండిలేదు; నిద్రాలేదు. తిమ్మన్న తిప్పలు

పడుతున్న చోటికి ఎప్పుడెప్పుడు చేరుకొందామా అని వారికి ఒక్కటే తహతహ! శనివారం అర్ధరాత్రిలోపల, ఏమైనాసరే, అక్కడికి చేరి పోవాలి. లేకుంటే, తిమ్మన్నను జీవంతో చూడడం సాధ్యపడదు.

తిమ్మన్న రోజులూ గడియలూ లెక్కబెడుతూ కాచుకూర్చున్నాడు. తిమ్మన్నతోపాటు ముసలమ్మా, రాముడూకూడ బిక్కుబిక్కున దిక్కులుచూస్తూ కాలక్షేపంచేస్తున్నాడు. అయిదురోజులు గిర్రున తిరిగిపోయాయి. పావురం తిరిగిరాలేదు. ముసలమ్మకూ, రామునికీ గుండెలు దడదడ కొట్టుకొంటున్నాయి. "తప్పక వస్తుంది," అని ముసలమ్మ రాముణ్ణి సముదాయిస్తుంది. "తప్పకుండా వచ్చి తీరుతుం"దని రాముడు ముసలమ్మను ఊరడిస్తాడు. "దిగులుపడకు, తప్పకుండా వస్తుంది!" అని వారిద్దరూ తిమ్మన్నకు ధైర్యం చెబుతారు. తప్పకుండా తప్పించుకొని బయటపడతానని తిమ్మన్నకు మొదట మొదట ధైర్యంగానే ఉండేది. కాని రానురానూ అది సన్నగిల్లుతూ వచ్చింది. అతడు చావడానికి తెగించి కూర్చున్నాడు.



తిమ్మన్నను చూచినప్పుడల్లా రామునికి కళ్లనిండా నీళ్ళుతిరిగేవి. ఆ తడికళ్ళు తిమ్మన్నకంటగూడా పడేవి. అప్పుడు అతని కళ్లనుండికూడ జలజల నీళ్ళుకారేవి.

ఆరోజు కూడ అయిపోతూ వస్తున్నది. సాయంత్రమయింది. చీకట్లు కమ్ముకొంటున్నాయి. తిమన్న జీవితానికి అదే కడపటిరోజు. చావు గడియలు క్రమక్రమంగా దగ్గరపడుతున్నాయి.

ఆగదిలో ఒక గోడ కానుకొని కూర్చున్నాడు రాముడు. ఏడ్చిఏడ్చి వాడి కళ్ళు ఉబ్బిపోయాయి. ముసలమ్మ ఇంకొకపక్కన కూర్చుంది—హనుమంతుణ్ణి మనసులో తలచుకొంటూ, సదా ఆయన జపంచేస్తూ. ఇద్దరికళ్లల్లోనూ అడుగడుగునా నీళ్లుధారలు కడుతున్నాయి. అప్పుడప్పుడు ఇద్దరికళ్లూ కలుసుకొంటాయి. వెంటనే ఇద్దరూ సర్రున ముఖాలు తిప్పుకొని వెక్కి వెక్కి ఏడుస్తారు.

ఇంటి ఇంకొకభాగంలో కాళప్పా, గంటయ్యా, దొంగభడవా జంబూ వారిపనిలో వారు మునిగిపోయిఉన్నారు. వాళ్లు డబ్బులు లెక్కబెడుతున్నారు. ఆడబ్బంతా మృగాల సర్కసుకంపెనీ తాలూకు ఇనపపెట్టెలో ఉండిన డబ్బే! మధ్యాహ్నమనంగా ఆరంభించారు వాటిని లెక్కబెట్టడం. ఇంకా అది ముగియనేలేదు.

గంట ఎనిమిదయింది, తొమ్మిదయింది, పదయింది!

"ఒరే రామూ, ఆ అన్నంచట్టి తీసుకొని నావెంటరా!" అన్నాడు గంటయ్య.

రాముడు ముసలమ్మవైపు చూశాడు. ముసలమ్మ రాముని వైపు చూసింది. అంతే. ఇద్దరినోటా మాట పెగల్లేదు. రాముడు బయటికివచ్చాడు. అన్నంచట్టి తీసుకొన్నాడు. గంటయ్య వెంటనడిచాడు. ఇద్దరూ తిమ్మన్నను పడేసిన కొట్టు చేరుకొన్నారు.

"ఒరేయ్ తిమ్మన్నా, ఇదుగో అన్నం. తిను. ఇదే నీకు కడపటి భోజనం. కడుపునిండా తిను!" అని పకపక నవ్వాడు గంటయ్య.

రాముడు కటకటాలగుండా అన్నం లోపలికి అందించాడు.

"ఒరేయ్ తిమ్మన్నా, నీవు నాతో మాట్లాడవుకదూ! సరే, వద్దులే. గంట పన్నెండు కొట్టనీ. ఆ తర్వాత నీవు ఎవరితోనూ మాట్లాడబోయ్యేదీ లేదు; మాట్లాడనూ మాట్లాడలేవు. ఒరేయ్, నీవు ఇప్పటికికూడ తప్పించుకోవచ్చు! 'కాళప్ప సర్కసులో చేరతాను,' అని ఒక్కమాట చెప్పు. చాలు. నీవు బతికిపోతావు. నీ మీద తుపాకీ కాల్చనే కాల్చరు. ఏమిరా, బదులే చెప్పవు? చావడానికే తెగించావన్న మాట!" అని గంటయ్యా ఒకే ధాటిగా వాగాడు.

అందుకూ జవాబులేదు.

"వద్దు లేరా, వద్దు. నీవేం మాట్లాడవద్దు. ఈ అన్నం తీసుకో. తిను. ఇదే నీకు కడపటి భోజనం!" అని గంటయ్యా కొంచెం అటు తప్పుకొన్నాడు. రాముడు అతనికి ఎదురుగా నిలుచుకొన్నాడు. అప్పుడు తలవని తలంపుగా ఒక అద్భుత విశేషం జరిగింది.

ఏమిటిది? గంటయ్యా వెనకపక్కగా ఎవరో గభాలున వచ్చి గట్టిగా పట్టుకొన్నారే! ఎవరది? ఆఁ, ఆఁ, ఆఁ, ఒక పెద్ద ఎలుగుబంటి! అరే! అది అచ్చంగా నల్లయ్యే!

వెనకగా వచ్చి అలా పట్టుకొన్న దెవరో గంటయ్యాకు తెలీలేదు. గంటయ్యా ధైర్యశాలే! మంచి బలశాలికూడ. వెంటనే ఆ పట్టు విడిపించుకోవడానికి చూచాడు. చేతనైనంతా తంటాలుపడ్డాడు. కాని సాధ్యంకాలేదు. నల్లయ్యే ఉడుముపట్టు పట్టాడు.

అదేవేళకు తటాలున వానిముందుకు వచ్చిదూకాడు చిన్న తిమ్మన్న! ఏమిటిది? అతడు ఏదో గుడ్డచుట్ట తెచ్చి గంటయ్యా నోట్లో బలవంతంగా కూరుతున్నాడే! గంటయ్యా కేకలు వేయబోయ్యాడు. కాని, శబ్దం బయటికి వెగిలివస్తేనా?

అదిగో పల్లయ్య! అతడేం చేస్తున్నాడు? గంటయ్య కాళ్లూ, చేతులు గబగబా కట్టివేస్తున్నాడు.

ఇల్లిక్కడ ఇది ఎవరు? అరే! నా ప్రియమైన వెల్లయ్య! వీడుకూడ వీరితో ఉన్నాడన్నమాట!

గంటయ్య గర్వం అణిగింది. ఒక పెద్ద కొయ్యదుక్కలాగున పడివున్నాడు, కదలనూ లేదు! మాట్లాడనూ లేదు.

చిన్నతిమ్మన్నా, నల్లయ్యా, పల్లయ్యా ఒక్కక్షణం కూడ వృథాపోనివ్వలేదు. ముగ్గురూ ఒకటిగాచేరి ఆ కొట్టుకు ముందున్న కటకటాలనుంచి ఒక కమ్మీని బలంగా లాగివేశారు. ఆ సందుగుండా వాళ్ళు గంటయ్యను లోపలికి తీసుకుపోయారు. తిమ్మన్నను కట్టివేసిన సంకెళ్లతోనే గంటయ్యను కట్టివేశారు. తిమ్మన్నా, వాళ్ళు ముగ్గురూ కూడ గబగబా బయటికి వచ్చివేశారు. కటకటాల కమ్మీని యథాప్రకారంగా బిగించారు. బయటికిపోయి చుట్టుప్రక్కలఉన్న చెట్టూ చేమల చాటున దాక్కున్నారు.

పొద్దు పరుగెత్తిపోతున్నది. అర్ధరాత్రి రానేవచ్చింది. కాళప్ప బందీకొట్టుకు పోవడం వారు చూచారు. వాడి చేతిలో తుపాకీ ఉంది. అదెవరు? కాళప్పవెంట పోతున్నది? జంబూ! అయితే జంబూ వచ్చింది ఇక్కడికన్నమాట! ఒరే మోసగాడా! ఇంతటి పరమ ద్రోహివా నీవు?

కాళప్పా, జంబూ బందీ కొట్టుముందుకు పోయినిలుచున్నారు.

"ఒరే తిమ్మన్నా, నేను ఇప్పుడు వచ్చింది ఎందుకో నీకు తెలుసా?" అని కాళప్ప వెకిలినవ్వు నవ్వుతూనే అడిగాడు. "నీకు తెలుసు. ఖండితంగా తెలుసు. మరి ఇప్పుడు చెప్పు. నీవు నా కంపెనీలో చేరతావా, లేదా?" అని నిగ్గదీశాడు.

గదిలోపలనుంచి బదులు రాలేదు. ఆ కటిక చీకట్లో లోపలి వ్యక్తి కాస్త కదలడంమాత్రం మసక మసకగా కనబడింది. "జంబూ,

ఆ కోతివెధవ ఏమీ మాట్లాడడం లేదు. నీవైనా కొంచెం చెప్పు. నీమాటకూడ వినిపించకోక పోతే ఇక తుపాకి ధామ్మనిపించవలసిందే!'' అని కాళప్ప కడపటి ప్రయత్నం చేశాడు.

జంబూ ఒక్క నవ్వు నవ్వాడు. తర్వాత ఒక చిన్న ఉపన్యాసం మొదలెట్టాడు. వాడి ఒక్కొక్క-మాటా దాక్కొన్న మృగాలు చెవియొగ్గి తాపీగా విన్నాయి.

''తిమ్మన్నా, నేను నీకు ఆప్త స్నేహితుణ్ణి కదూ! నామాటవిను. ఇది కట్టకడపటి అవకాశం. దీన్ని వృథాచేసుకోవద్దు. కాళప్ప



ప్రిందు కంపెనీలో! చేరిపో. కాళప్ప మాస్టారుతో పగ పెట్టుకోవడం మంచిదికాదు. ప్రొఫెసర్ జంబూతోకూడ విరోధం పెట్టుకోకు. జయం ఎవరికో ఇప్పుడు తెలిసిందా? కాళప్ప మాస్టారు కంపెనీకి ఖామందు. నేను మేనేజర్ని. నీవూ, నీ సహచరులూ సిబ్బంది. మనం ఇల్లాగే కాలం తోద్దాం. తిమ్మన్నా, జంబూతో చెర్లాట ఆడవద్దు. జంబూ సామర్థ్యం ఇప్పటికి నీకు తెలిసి ఉంటుంది. ఇది ఎప్పుడో తెలుసుకొని ఉండవలసింది. పొరపాటుచేశావు. పోనీలే! అయి పోయిందాన్ని గురించి ఆలోచన ఎందుకు. తిమ్మన్నా, కంపెనీలో చేరుతానని ఒప్పుకో. తక్కినవాటినికూడ చేరుస్తానని మాటయివ్వు. లేకుంటే... లేకుంటే! అయ్యో! నీవు అన్యాయంగా చనిపోవలసిం దేనా? ఇది అనుకొంటేనే నేను భరింపలేకున్నానే! నాకు భోరున ఏడుపువస్తున్నది.''

జంబూ ఏడుపు లంకించుకొన్నాడు. అంతా వట్టి నటన! వాడి చూచి కాళప్ప నవ్వాడు.

ఇంత నడచినాకూడ లోపలనుంచి జవాబు రానేలేదు. ''నా తిమ్మన్నా, నీకు నామీద ఎందుకింత విరోధం? ఇంతదూరం రాకూడ నాతో మాట్లాడకున్నావే!'' అని నిజంగా దుఃఖపడు వాడి మల్లేనే చెప్పాడు.

ఇంతలోపల ''జంబూ, తిమ్మన్న నాతో మాట్లాడడులే. నాతో మాట్లాడితే అతగాడినాలుక అపవిత్రమైపోతుందట,'' అంటూ అంటూనే కాళప్ప ఆత్రంగా తుపాకి పైకెత్తాడు. ''ఒరేయ్ తిమ్మన్నా, ఇక నీతో మాట్లాడుతూ కూర్చునేందుకు పొద్దులేదు. సరి. ఒక్కటే ప్రశ్న వేస్తున్నాను. చేరతావా, లేదా? అమీ తుమీ తేల్చు,'' అన్నాడు. లోపలి ఆకారం కాస్త కదిలినట్లయింది. అంతే. అంతకు మించి ఏంలేదు. బదులే రాలేదు.

...రి అడుగుతున్నాను—చేరతావా, చేరవా?''
...డు. దానికికూడ జవాబులేదు.

"సరి, మూడోసారి! కడసారిగా గట్టిగా అడుగుతున్నాను. చేరతావా, చేరవా?"

ఊఁహూఁ, అందుకూ బదులులేదు. లోపలి ఆకారం మళ్ళీ ఒకసారి కదలాడింది.

కాళప్ప తుపాకీ బారు చేశాడు. కటకటాలగుండా లోపలికి జాచి పట్టుకొన్నాడు. మరుక్షణంలోనే తుపాకి ఢామ్మన్నది. ఆ ఉత్తరక్షణంలోనే నేలమీద ఏదో దబ్బున పడిపోయిన శబ్దం. అంతలోపాపం మూర్తీభవించిన ఒక ప్రాణి కథ అంతమైపోయింది.

# 10

వానాకాలం ఆరంభమయింది. అది సోమరితనంగా తిష్ఠవేసు క్కూచోవడానికి తగినకాలం. అయితే సోమరిపోతులకు మృగాల సర్కస్సులో చోటులేదు. వేకువజామున అయిదుగంటలమొదలు తొమ్మిదిగంటలదాకా, మధ్యాహ్నం రెండుగంటలమొదలు సాయంత్రం ఆరుగంటలదాకా సాధన, సాధన, ఒకేసాధన!

"సోమరిపోతులు, బలముడిగినవారు, భయపడేవారూ సర్కసునుంచి మర్యాదగా బయటికి నడవాలి!" అని తిమ్మన్న తరుచు అంటూ ఉండేవాడు. అటువంటి వారు కొందరు అందులో ఉండినారు. కాని, అందులో ఎవరూ తమ గుణాలను బయటికి చూపుకోలేదు. చూపుకొంటే, ఇంకేముంది, వెంటనే బయటికి గెంటివేస్తారుగా!

సర్కస్సు సాధనలు జరిగే చోటు వేరెక్కడో కాదు. గంటయ్య ఇంటిలోని ఒక పెద్ద పందిట్లోనే! ఎట్లాగయినాసరే, మళ్ళీ ఆ సర్కసుకంపెనీ ఆరంభించాలనే అంతా ఆయత్తం చేస్తున్నారు. ముసలమ్మ మరీ మరీ కోరుతున్నదిగూడ అదే. పాత సర్కసు మృగాలు, కొత్తవీ అన్నీ ఒకటైపోయాయి. పాతవిద్యలు సాధన చెయ్యడం, కొత్తవి నేర్చుకోవడం అవిచ్ఛిన్నంగా సాగిపోతున్నాయి.

ఇక గంటయ్యను గురించి దిగులు పడపలసిందిలేదు. కాళప్ప వస్తాడన్న భయమూ లేదు. వాణ్ణి ఆనాడే చెరలో పడేశారుగా!

ఆరాత్రి కాళప్ప కంటినిండా నిద్రపోయాడు. ఏరాత్రి? పేల్చిన రాత్రి. "మృగాలసర్కస్సుమూలంగా వచ్చిన ఇబ్బందు లన్నీ తీరిపోయాయి. ఇదివరకు అందరూకూడ ఆ సర్కస్సు ఆటకే పోయేవారు. నాసర్కసుడేరాలో ఎవరూ కాలైనా పెట్టేవాడు కారు. ఇంకమీదటనో? అంతా అందుకు తలకిందులుగా ఉంటుంది వ్యవహారం! నాకంపెనీ జోరుగా జరిగిపోతుంది. డబ్బు కుప్పలు కుప్పలుగా వచ్చిపడుతుంది," మొదలైన ఆలోచనలతో తియ్యని కలలు కంటూ గట్టిగా నిద్రపోయాడు కాళప్ప.

తెల్లవారి బాగా పొద్దుపోయి నిద్రలేచాడు. లేవంగానే, ఆ నిద్ర కళ్ళతోనే "ఒరే! గంటయ్యా!" అని కేకవేశాడు. బదులు రాలేదు. చాలాసార్లు గొంతెత్తి పిలిచాడు. జవాబు లేదు. ఆ కేకలు విని జంబూ లేచాడు. వాడుకూడ ఏవేవో మధురస్వప్నాలుకంటూ మహానిద్రపోయాడు. కంపెనీమేనేజరు కాబోతున్నాడుకదూ మరి!

"జంబూ, పొద్దయిపోయింది. మనం పోదాం. గంటయ్యకు ఒకటి రెండు సంగతులు చెప్పాలి. ఆ గాడిద వెధవ ఎక్కడ పోయాడో!" అని విసుక్కున్నాడు కాళప్ప.

"గంటయ్య ఆ బందీకొట్టుదగ్గరే నిలుచుకొన్నాడో ఏమో!" అని ముసలమ్మ లోపలినుంచి అనడం వినబడింది.

కాళప్పా, జంబూ బయటికి వచ్చారు. అక్కడా గంటయ్య కనబడలేదు. గుండుదెబ్బతో కూలిపడిపోయిన తిమ్మన్నను చూడా లని వారికప్పుడు కుతూహలం పుట్టింది. సరాసరి ఆ కొట్టుదగ్గరకు వెళ్ళారు. కటకటాలగుండా లోపలికి చూచారు.

అదిగో, ఆమూలలో చచ్చిపడ్డాడు తిమ్మన్న! ఏమిటి? వాడు తిమ్మన్నేనా, కాదా? నిదానించి నిగాగా చూచారు. హా,

వాడు గంటయ్యా. అవును, వాడు గంటయ్యే. సందేహంలేదు. వాడి కాళ్ళూ చేతులు కట్లతో ఉన్నాయి. నోటినిండా గుడ్డలు తురిమి ఉన్నాయి. వాడు చచ్చిపోయాడు.

కాళప్పముఖం వెలవెలపోయింది. గుడ్లు తేలిపోయాయి. ఒళ్ళంతా చెమటలు కమ్మాయి. "అయ్యయ్యో! నేను గంటయ్యను చంపివేశానే!" అని వాడు గట్టిగా అరిచాడు. వెంటనే పరుగు పెట్టాడు—వెఱ్ఱిపట్టినవాడిలాగా.

వాడు చేసింది హత్య, ఆనేరం మరుగుపరచడానికి ప్రయత్నించాడు. కాని, పోలీసువాళ్ళకు సందేహం తోచింది. వాళ్ళు దర్యాప్తుచేశారు. నేరస్థుణ్ణి కనిపెట్టనే కనిపెట్టారు. కాళప్పే గంటయ్యను చంపిన హంతకుడు. అది నిరూపించడానికి వాళ్ళు అట్టే శ్రమకూడా పడలేదు. వాణ్ణి కోర్టులో నిలబెట్టి విచారణ చేయించారు.

కాళప్పవకీలే కాళప్ప తరఫున హాజరైనాడు. చట్టాలన్నీ ఏవేవో తిరగవేసి తెగవాదించాడు. కాని ఫలితం లేకపోయింది. కాళప్పకు శిక్ష పడనే పడింది—జీవితశిక్ష. వాణ్ణి తీసుకుపోయి ఖైదులో పడేశారు.

ఇక జంబూసంగతి. తానూ, కాళప్పా చేసిన తప్పు వాడికి బాగా బోధపడిపోయింది. తిమ్మన్నే అనుకొని గంటయ్యను కాల్చి వేశాడు కాళప్ప. ఈ అస్తవ్యస్తం ఎలా జరిగింది? ముంగిట్లో పోట్లాట జరిగిన జాడలూ, కొన్ని కాలిగుర్తులూ కనిపించాయి. ఆ కాలిగుర్తు లెవరివి? జంబూ కళ్ళల్లో కళ్ళుపెట్టుకొని చూచాడు. ఒక కోతి, ఒక ఎలుగు, ఒక పులి, ఒక కుక్క— కాలిగుర్తులవి. జంబూ బలే బుద్ధిశాలికదూ! అంతా తేటతెల్లమయిపోయింది. ఆ నాలుగుమృగాలూ కలిసి తిమ్మన్నను తప్పించాయి. గంటయ్యను అతనికి బదులుగా కొట్టులో పట్టికట్టిపడేశాయి.

ఇప్పుడు జంబూకు ఒకసంగతి తేటతెల్లమయింది. ఈ వ్యవహారంలో తాను పాల్గొన్న విషయం చిన్నతిమ్మన్నా, ఒక్కినవారూ సమక్షంగా చూచారు. వాళ్ళు అంతలోపల వెళ్ళిపోయి ఉండరు. ఇక్కడే ఎక్కడో దాక్కొని ఉంటారు. జంబూ, చుట్టుపట్టులందున్న పొదల మాటులన్నీ చూచాడు. అయిదు ముఖాలూ కనబడ్డాయి! తిమ్మన్న, నల్లయ్యా, పల్లయ్యా, చిన్నతిమ్మన్న, వెల్లయ్యా అందరూ కంట బడంగానే జంబూ గడగడలాడిపోయాడు. కాని, వాళ్లేమీ మాట్లాడలేదు. జంబూను రెప్పలు వాల్చకుండా చూస్తూ నిలుచున్నారు. జంబూ ఆ దృశ్యం చూడలేకపోయాడు. వెనక్కుదాడుతీశాడు.

తౌడయ్యా, చల్లయ్యా, ఒంటెలూ ఇదివరకల్లా జంబూ కక్షిగా ఉండేవారు. ఇప్పుడు వాళ్ళు జంబూ ఊసే ఎత్తడంలేదు. జంబూను నమ్మిందే వాళ్ళుచేసిన పెద్దతప్పు. వాడు ఇంత కర్కోటకుడని వాళ్లకు ముందే తెలియలేదు.

ఇప్పుడు సర్కస్సుకంపెనీలో ఎన్నిమృగాలు! మృగాల విషయం ఉండనీ. కొందరు మనుషులుకూడ చేరారు. సర్కసు విద్యలు చేయడానికి కాదు; పని పాటులు చేయడానికి. వంట వండడం, అందరికీ వడ్డించడం, అంట్లు తోమడం, కసవూడ్చడం—ఇలా ఎన్నెన్నో పనులు వాళ్లకు! విద్దెలుచూపడానికి మృగాలు, పనులు చేయడానికి మనుషులు! మనుషుల గుంపులో ఆ పాతస్నేహితులూ ఉన్నారు.

కాళప్ప ఖైదులో పడగానే కాళప్ప సర్కస్సు మూతపడిపోయింది. విద్దెలుచూపేవారికి బ్రతుకు దెరువు లేకుండా పోయింది. వాళ్ళు తిమ్మన్నదగ్గరకు వచ్చారు. గోవిందరావు మాస్టారును కాదని కాళప్ప పక్షం చేరినందుకు క్షమాపణ కోరుకొన్నారు. వెంటనే ఆ నలుగురికీ మృగాల సర్కస్సులో నౌకరీ దొరికింది. జీతంకూడ రెండింతలు.

కారు విద్యలు చేసే మృగాలకు ఆనందరావు అండగా నిలిచాడు. సైకిళ్ళు తొక్కే మృగాలకు గోవిందుడు శిక్షణయిస్తూ వచ్చాడు. ఇలాగే తక్కినవారూ తక్కిన మృగాలకు వాటివాటి విద్యల్లో తోడ్పడుతూ వచ్చారు.

మృగాల సర్కస్సుకంపెనీ మళ్లీ గట్టిగా పాదుకొన్నది. దాన్ని బాగా నడపడానికి డబ్బు బాగా ఉండాలిగా? అవును, ఉండాలి మరి. కావలసినంతకంటే కూడా ఎక్కువగా గంటయ్య ఇంట్లో డబ్బు మూలుగుతున్నది. కాళప్పా, జంబూ భయపడి పారిపోయారు కదూ! అప్పుడు వాళ్లకు వేరేదీ జ్ఞాపకంలో లేదు. నిప్పంటుకొన్న డేరానుంచి దొంగిలించుకొనిపోయిన ఆ ఇనపపెట్టెనుగూడ వారు మరచిపోయారు. అది గంటయ్య ఇంట్లోనే ఉండింది. అన్నిమృగాలూ ఎన్నినాళ్ళు కావలసివస్తే అన్నాళ్ళు సుఖంగా, నిర్విచారంగా బతకవచ్చు. నోట్లుకట్టలు కట్టలుగా ఆ పెట్టెలో మూలుగుతున్నాయి.

రాముడి ఉత్సాహానికి అంతేలేదు. సర్కసు మధ్యలోనే వాడి జీవితం. ఎన్నాళ్ళుగానో వాడు కంటూ వచ్చిన పగటికల ఫలించింది. వాడిగద్దర కొన్ని సహజసిద్ధమైన గుణాలు ఉండినాయి. వాటిని ఉపయోగించే అవకాశం ఇప్పుడు దొరికింది. వాడు కొ మృగాలను మచ్చికచేశాడు. తిమ్మన్నకూడ నేర్పలేని కొన్ని విద్దె వాటికి నేర్పాడు.

గజేంద్రుడు మొదలైనవారికి కూడ ఇప్పుడు చేతినిండ తగిలింది. ఇదివరకు వాళ్ళు తమకు తాము మాత్రమే సాధనచే కొనేవారు. ఇప్పుడు ఇతరులకుకూడ నేర్పుతున్నారు. గజేంద్ర అడవికిపోయి నాలుగు పిల్లయేనుగుల్లను పట్టుకొచ్చాడు. పల్లయ్య మూడు పులిపిల్లలనూ, నల్లయ్య మూడు ఎలుగుపిల్లలనూ తెచ్చాడు. ఇదిచూచి సింగన్న "నేనుమాత్రం ఎందుకూరుకొంటాను? నేనూ పోయి నాలుగు సింహం పిల్లలను పట్టుకొస్తా" నన్నాడు.

ఇదివిని చిన్నతిమ్మన నవ్వాడు. "ఒరేయ్ దద్దమ్మా, నీజాతి వారు ఈ అడవుల్లో ఎక్కడా లేదు. కొందరుమాటుకు ఉత్తర ఇండి

యాలో 'గిర్' అడవుల్లో ఉన్నారు. ఆఫ్రికాలో చాలామంది ఉన్నారు. నీవు అక్కడికి వెళతావా ఏం? అని అడిగాడు. సింగన్న బదులు చెప్పలేకపోయాడు.

"అల్లాఅయితే ఏనుగుపిల్లలను నాకప్పగించాలి,'' అని హఠం పట్టాడు సింగన్న.

"అట్లయితే నేను ఎలుగుపిల్లలను మచ్చికచేస్తా''నన్నాడు గజేంద్రుడు.

"అలాగేకానీ. అయితే, పులిపిల్లలు నాకుకావాలి,'' అన్నాడు నల్లయ్య.

అప్పుడు పల్లయ్యకు చదువునేర్పడానికి పిల్లలే లేకపోయారు. అతగాడు వెళ్లి రెండు జింకపిల్లల్ని తెచ్చుకున్నాడు.

సర్కసు విద్యలు సాధనచేసే పెద్ద పందిట్లో ఒకటే గలాటా! అన్ని మృగాలూ కలిసి ఏకకాలంలో సాధనచేసేవి. అందువల్ల అక్కడ బలే సందడిగా ఉండేది.

అదంతా చూచుకొంటూ, అక్కడ ఒక ఆసామి అతి పరితాప గంగా పండుకొని ఉన్నాడు. ఆయన పూచికపుల్లలా కృశించిపోయి న్నాడు. కండ్లు లోపలికిపోయాయి. ముఖం వాడిపోయింది. ఒళ్లంతా ముకలు బయటపడ్డాయి. కాళ్లుచేతులు కదిలించడానికికూడ ఆయన శమపడుతున్నాడు. మధ్యమధ్య ముక్కుతూ మూలుగుతూ డు. ఆయన ఏం జ్వరంవచ్చి పండుకొన్నారా? లేదు లేదు. శనవ్రతం పట్టి పండుకొన్నారు. ఇంతకూ ఎవరాయన? కాళప్ప వకీలు.

ఎంత మారిపోయాడు వకీలుపంతులు! ఇదివరకు కండలు బలిసి ఎంతో ధాటీగా ఉండేవాడు. ఇప్పుడు బక్కచిక్కిపోయాడు. మనిషిని గుర్తుపట్టడంకూడ కష్టం. అన్నం నీళ్లు లేకుండా చాలా నాళ్లు ఉంటే ఎవరైన రూపు మారిపోకుండా ఉంటారా?

పదకొండునాళ్లకుముందు అక్కడికి వచ్చాడు ఆ వకీలు. "తెమ్మన్నా, మీరందరూ నన్ను క్షమించాలి. నేను చాలా తప్పు



చేశాను. ఇప్పుడు నాకు తెలిసివచ్చింది—సూటిదారే మేటిదారి అని. నాకు ఒకే ఒక ఆశ ఉంది. ఇంక నేను చచ్చేవరకూ మీతోనే ఉండాలనుకొన్నాను. అందుకు నాకు అనుమతి ఇవ్వండి,'' అంటూ వచ్చీరాంగానే చెప్పుకొన్నాడు.

వెంటనే తిమ్మన్న సహచరుల అభిప్రాయాలు అడిగాడు. ఎవరూ ఒప్పుకోలేదు. వెనుక కాళప్ప తమల్ని గోవిందరావు మాస్టారు ఇంటినుండి దయాదాక్షిణ్యాలు లేకుండా వెళ్లగొట్టాడు. ఆయనకు చట్టనిబంధనలను చూపించి ఆయనను ఎగదోసినవాడు ఈ పెద్దమనిషే, అంతేనా, తమల్ని దుమ్మెత్తిపోస్తూ పత్రికల్లో పాడు పాడు వార్తలు వ్రాసి ప్రచురించిన మహానుభావుడు కూడ ఇతడే. ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాసిందిగూడ ఇతగాడే. ''ఓయ్ వకీలయ్యా, వచ్చినదారినే మర్యాదగానే వెళ్లిపో. నీ చట్టాలూ

గిట్టాలూ అన్నీ నీతోనే తీసుకొనిపో. ఇక్కడ ఒక్కటీ పెట్టిపోవద్దు.'' అని తిమ్మన్న నిర్దాక్షిణ్యంగా చెప్పివేశాడు. వకీలు గడ్డంపట్టుకొని బతిమాలాడు.

''ఇదివరకు చేసింది చాలదని ఇంకా ఏదో ద్రోహంచేయాలని ఉద్దేశ్యమేమో! నాకు ఒళ్లు మండిందంటే నీ తలకాయ కటిక్కన కొరికేస్తాను సుమా! ఆ పని జరిగేలోపల బుద్ధిగా పారిపో!'' అని సింగన్న గర్జించాడు.

తనను ఎవరూ నమ్మడంలేదని బాగా తెలుసుకొన్నాడు వకీలు. ''నేరస్థులు తమ తప్పులు తెలుసుకొని పశ్చాత్తాప పడడం కద్దు. ఆ తర్వాత బుద్ధిగా బతకాలని ఆశపడడంకూడ కద్దు. ఈ రెండూ నాకున్నాయి. కాని, మీరు నమ్మనంటున్నారు. సరి, నేను ఇక్కడినుంచి కదలనే కదలను. ఒకటి: సింగన్న ఇందాకా ఉరిమినట్టు నాతల తీసివేస్తే తీసివేయనీ. లేదా, నిరాహారదీక్ష పడతాను. మీ కండ్లయెదుట ప్రాణాలు తీసుకొంటాను. నేను ప్రాణాలు వదిలేటప్పుడైనా నన్ను నమ్మకపోతారా? నాకు అంతేచాలు,'' అని ఆయన మొండికివేసి కూర్చున్నాడు.

నిలుచున్నచోట అట్లాగే పండుకొన్నాడు. మూడురోజులు గడిచాయి. ఆమూడునాళ్ళూ అదేచోట పండుకొన్నవాడు పండుకొన్నట్లే ఉండిపోయాడు. లేవనేలేదు. ''ఓయ్ వకీలయ్యా, ఇది బలే నిరాహారవ్రతమే! మా పరోక్షంలో మీరు బాగా మెక్కుతున్నారుగదూ! ఇలా అయితే ఎవరైనా, ఎన్నాళ్లయినా నిరశన వ్రతం కొనసాగించవచ్చునే!'' అని చిన్నతిమ్మన్న నలుగురికీ వినబడేటట్టుగానే యద్దేవాచేశాడు.

మృగాలు కడుపు చెక్కలయేటట్లు నవ్వాయి.

నానాటికీ కృశించిపోతున్నాడు వకీలు. అది నిజమైన నిరశన వ్రతమేనసీ, దొంగతనంగా ఆహారం తీసుకొనే దొంగ నిరశనవ్రతం కాదనీ అందరికీ స్పష్టమైంది. ముసలమ్మ వరాండాలో ఒక చాప

పరిచింది. మృగాలు ఆయనను పట్టుకొని లేపి ఆ చాపమీద పడుకోబెట్టాయి.

"వకీలయ్యా, చాలు. లేచి ఆహారం పుచ్చుకోండి," అని ముసలమ్మ అడుక్కొంది.

వకీలు హీనస్వరంతో "లేదు లేదు. మృగాలు నన్ను నమ్మే వరకూ నే నిది మాననే మానను. చచ్చినా సరే," అని తన నిశ్చయం తెలిపి ఒక పక్కకు తిరిగి పండుకొన్నాడు.

పదకొండవరోజున వకీలు మరీ నీరసించిపోయాడు. నోటమాట పెగలడం కూడ కష్టమయిపోయింది. ముసలమ్మ మృగాలను పిలిచి "వకీలు మనస్సులో చాలా నొచ్చుకొంటున్నాడు. ఇది దొంగ నిరాహారదీక్ష కాదు. ఆయన మనస్సు బాగా మారిపోయింది. నేను గట్టిగా నమ్ముతున్నాను. మీకుకూడ నమ్మకం కుదిరినట్లు ఆయనకు చెప్పండి. లేకుంటే అన్యాయంగా బ్రాహ్మడు చచ్చిపోతాడు. అది మీ మనస్సాక్షిని కలకాలం బాధ పెడుతూనే ఉంటుంది. అందుకు చోటివ్వకండి," అని హితవు చెప్పింది.

ముసలమ్మ మాటకు మృగాలు కాందటాయా? అవి ఆపాటికే ఆమెకు ఎంతగా ఋణపడిఉన్నాయి. వెంటనే అవి అన్నీ కలిసి వకీలయ్యతో ఆయనను తా మిప్పుడు నమ్ముతున్నట్లు చెప్పాయి. తక్షణమే ముసలమ్మ వకీలయ్యకు ఒక లోటా నిండా నిమ్మపండ్లరసం తయారు చేసి తెచ్చియిచ్చింది. వకీలయ్య సంతోషంగా దానిని తాగాడు. ఈవిధంగా ఆయన నిరశనవ్రతం ముగిసిపోయింది.

"ఒక విషయం మీకు తెలిపాలి. వెనుక నేనూ, కాళప్ప కలిసి మిమ్మల్ని ఇంటినుండి తరుమగొట్టాంకదూ! అప్పుడు నేను మీకు ఒక పత్రం చదివి వినిపించాను జ్ఞాపకముందా? అదేదంటే, గోవిందరావు మాస్టారు తమ ఇల్లూ భూములూ అన్నీ కాళప్పకు వ్రాసియిచ్చారన్నపత్రం. అది అసలైనపత్రం కాదు. నేనై నేను తయారుచేసిన తప్పుడుపత్రం. అప్పుడు నేను అంతదుష్టుడుగా ప్ర

ర్తిస్తినన్నమాట,'' అని ఆయన వాటితో తన పశ్చాత్తాపం తెలుపుకొన్నాడు.

మనస్సు మారిన వకీలుతో ఉపయోగం కనిపించింది. వాన కాలం ముగిసేవేళకు మృగాలసర్కస్సు తన పర్యటన ఆరంభించాలి. అప్పుడు మనుషులతో చాలా పని ఉంటుంది. దానికి వకీలే సరియైన మనిషి. ఆయనకు చట్టం బాగా తెలుసు. మృగాలు ఆయన కిచ్చిన పనిని ఆయన బాగా గమనించుకొంటూ వచ్చారు.

సర్కసు కంపెనీలో ఇంకొకడు కూడ చేరాడు. ఆయన కన్నయ్య. కంపెనీ లెక్కలు చూచుకోవడానికి తగిన మనిషి ఒకడు కావద్దూ? అందుకోసమే రాముడు వాణ్ణి పిలిపించాడు. కన్నయ్యకు కూడ సర్కసులో చేరాలని చాలా ఆశ. చాలా ఊర్లు చుట్టవచ్చు. అందువల్ల ధైర్యంగా వచ్చివేశాడు.

వానాకాలం. వానలు ఎడతెగకుండా కురుస్తున్నాయి. మేఘాలు గుంపులుగుంపులుగా తిరుగాడుతున్నాయి. పిడుగులూ ఉరుములధ్వనులు చెవులు చిల్లులుపడేట్లు చేస్తున్నాయి. మెరుపులు కళ్లకు మిరుమిట్లు గొలుపుతున్నాయి. ఎక్కడ చూచినా వర్ష ధ్వనులే. ఒకరిమాటలు ఒకరికి వినిపించాలంటే బిగ్గరగా మాట్లాడ వలసివస్తున్నది. ఇంత హడావడిలోకూడ సాధనలు యథావిధిగా సాగిపోతూనేఉన్నాయి. విరామంలేదు. విశ్రాంతిలేదు. విసుగూ లేదు.



ఒకరోజున వానలో తడుసుకొంటూనే అక్కడికి వచ్చి చేరారు ఇద్దరు. ఆ యిద్దరూ అమెరికన్లు.

"మేమిద్దరం అమెరికన్లము. ఒక సర్కసు కంపెనీ యజమానీ, మేనేజర్లం," అని వాళ్ళు తమ ప్రవర చెప్పుకొన్నారు.

"మీ సర్కసును గురించి అమెరికాలో విన్నాం. దాన్ని చూడడానికి అక్కడ అందరికీ చాలా ఆశగా ఉంది. పిల్లలు చాలా మారాం చేస్తున్నారు. మీ కంపెనీ అమెరికా అంతట ఒక పర్యటన చెయ్యాలి. మిమ్మల్ని ఆహ్వానించడానికే ముఖ్యంగా మేము వచ్చాము. ఎంత డబ్బు ఖర్చు పెట్టవలసివచ్చినా పెట్టడానికి తయార్. కొంచెంకూడ జంకం. అన్ని యేర్పాట్లూ మేమే చేసుకొంటాము. మీరు సమ్మతిస్తే చాలు," అన్నారు.

అమెరికాకు ప్రయాణం! మృగాలసంతోషానికి పారమే లేదు.

"అమెరికాకు తర్వాత ఐరోపా. ఐరోపాకు తర్వాత ఆసియా. ఆసియాకు తర్వాత ఆస్ట్రేలియా—అన్ని దేశాలకూ పోవచ్చు. పర్యటన కార్యక్రమంకూడ సిద్ధంచేశాము. ప్రపంచ పర్యటనకు మీ ఏర్పాట్లు మీరు చేసుకోండి. వచ్చే నెల ఇరవయ్యవ తేదీ మా ఓడ కొచ్చిన్ రేవుకు వస్తుంది. అందులో బయలుదేరాలి," అనికూడ ఆ అమెరికన్లు చెప్పారు. చెప్పి, వాళ్ళు సెలవు తీసుకొన్నారు.

ఆహా! ఏమి అదృష్టం! ఏమి అదృష్టం!



మరుసటిరోజు ఒక ముఖ్యమైన విషయం బయటపడింది. అది సంపూర్ణంగా ఎదురుచూడండి.

## 11

సింగన్న నిద్రపోనేలేదు. మధ్యాహ్నభోజనంచేసి అందరూ నిద్రపోతున్నారు.

సింగన్న పగటిపూట నిద్రపోలేడు. అది కుదరనే కుదరదు. కండ్లుమూస్తాడు; వెంటనే దిగ్గున లేస్తాడు—వెనక జరిగిన ఒక సంగతిని కలగని. వెనుక ఒకసారి నవ్వుల బంగరుబొానను అతడు పోగొట్టుకోలేదూ? ఆ సంఘటన అతని జ్ఞాపకానికి వస్తుంది.

ఆనాడుకూడ అంతే. సింగన్న కొంచెంసేపు నిద్రపోయాడు. అదిగో ఎవరో తనకు మత్తుమందు వాసన చూపించి మైకం కలిగి స్తున్నాడు. చివరకు, నవ్వుల బంగరుబొానను ఎత్తుకొని పారిపో తున్నారు!

సింగన్న లేచాడు. చుట్టుపక్కల చూచాడు. దగ్గరే రాముడు పండుకొని నిద్రపోతున్నాడు.

రాముని కుడిఅరచేతిలో పచ్చగా ఏదో కనిపించింది. ఏ టది? పచ్చపొడుపా? సింగన్న పరిశీలనగా చూచాడు. ఆంజనే ఆకారంలా కనబడుతున్నదే! అవును. అచ్చంగా అది ఆంజనే రూపమే.

సింగన్న జ్ఞాపకం వెనుకటి రోజులమీదికి వెళ్లింది. నవ్వు బంగరుబొాన కుడి అరచేతిలోకూడ పచ్చపొడిచి ఉండింది—' నేయునిరూపం! అది అందరికీ తెలుసు. గోవిందరావు మా చనిపోయేటప్పుడు పలవరించలేదూ? అప్పుడుకూడ ఆ రూ ఉద్ఘాటించి చెప్పారే!

ఇదిగో, రాముని కుడిఅరచేతిలోకూడ అదే రూపం ఉ గుండెలు పగిలిపోయేటట్టనిపించింది సింగన్నకు. ఒక ఠే ఆనంద

వెంటనే అతడు తిమ్మన్న, చిన్నతిమ్మన్న, గజేంద్రుడు, ఎలుగులు, పులులు, ఒంటెలు, గుఱ్ఱాలూ అందరినీ పిలిచాడు. అందరూ లేచి పరుగెత్తివచ్చారు. సంగతంతా సింగన్న వాళ్లకు చెప్పాడు. వాళ్ళుకూడ రాముని అరచేతిని పరిశీలనగా చూచారు. వాళ్ల గుండెలుకూడ పడపడకొట్టుకున్నాయి.

"నవ్వుల బంగారుబాన! ప్రియమైన గోవిందరావు మాస్టారు గారి ఏకైకపుత్రుడు. ఆహా! వాడు చావలేదన్నమాట! పోయిం దనకొన్న పెన్నిధి దొరికిపోయింది!" పట్టలేని సంతోషంతో మృగాలన్నీ ఆనందబాష్పాలు విడిచాయి!

సందడి విని రాముడు లేచాడు. చుట్టూ పారజూచాడు. మృగాలన్నీ తన్ను చుట్టు ముట్టుకొని కళ్లనిండా నీళ్ళు విడుస్తున్నాయి. సంగతేమిటో వాడికి బోధపడలేదు. మిణక రిస్తున్నాడు. చివరకు నిబ్బరం తెచ్చుకొని "ఏమిటివిశేషం? మీరందరూ ఎందుకు ఏడుస్తున్నారు?" అని అడిగాడు.



తిమ్మన్న ఏదో చెప్పబోయాడు. కాని నోటమాటలు పెగిలి రాలేదు. "ఇప్పుడు మాకు అంతా తెలిసిపోయింది. మీరే మా నవ్వుల బంగరుబాన!" అనిమాత్రం అతడు ఎలాగో అతికష్టం మీద చెప్పగలిగాడు. ఆపైన మాట్లాడలేకపోయాడు. రాముణ్ణి ఆప్యాయంగా సందిట్లోకి తీసుకొని ఒళ్లంతా నిమిరాడు.

"ఏమిటే, నేను నవ్వుల బంగరుబాననా! కాదు కాదు; నేను నవ్వుల బంగరుబానను కాదు; రాముణ్ణి," అని ఏమీ ఎరగని ఆ అబ్బాయి అన్నాడు.

"రాముడు నాకూ మా నవ్వుల బంగరుబానే! నవ్వుల బంగరుబానే సయానా మా రాముడు. అవును, సందేహం లేదు. నవ్వుల బంగరుబాన మా గోవిందరావు మాస్టారుగారి ముద్దుల కొడుకు," అంటూ కన్నీళ్ళు తుడుచుకొంటూ తుడుచుకొంటూనే సింగన్న మురిసి మురిసి పోతున్నాడు.

"ఏమిటి సింగన్నా మరీ ఎంతగా మాట్లాడుతున్నావు! నాకు తల్లీ లేదు; తండ్రీ లేదు. గంటయ్య నన్నెవరో దేశదిమ్మరుల వద్దగదా నాలుగు డబ్బులిచ్చికొన్నాడు!" అని రాముడు అన్నాడు. పాపం! వాడు అదే అభిప్రాయంతో ఉన్నాడు.

ముసలమ్మ ఇదంతా లోపలినుంచే వింటూ, చూస్తూ ఉండింది. చివరకు బయటికి వచ్చింది. రాముణ్ణి దగ్గరకు తీసుకొని ప్రేమపూర్వకంగా నిమురుతూ "రామూ, ఆ రహస్యం నీకు తెలపవలసినముహూర్తం వచ్చివేసింది," అని చెప్పింది.

"ఏ రహస్యం అవ్వా!" అని రాముడు, ఏమీ దిక్కుతోచక, ఆశ్చర్యంగా అడిగాడు.

"నీవు గంటయ్యకు లభించిన రహస్యం రామూ! నీవు ఇదివరకు ఎన్నిసార్లో అడిగావు. అది బయటపెట్టదగినవేళ ఇంకా రాలేదని ఎప్పటికప్పుడు నీకు జవాబు చెబుతూ వచ్చాను జ్ఞాపకం లేదూ! ఆవేళ ఇప్పుడు వచ్చింది," అని ముసలమ్మ చెప్పింది.

ముసలమ్మ ముఖకళికలు శ్రద్ధగా గమనిస్తూ, ఆ రహస్యం వినడానికి మృగాలన్నీ ఆవిడచుట్టూ మూగాయి.

"అవ్వా, నీ మాటలు ఆశ్చర్యంగా ఉన్నాయి! ఇదివరకంతా నేను ఎంత అడిగినా చెప్పలేదు. ఇప్పుడు అడగకుండానే చెబుతున్నావే! ఏమిటిదంతా? నాకేమీ బోధపడకుండా ఉందే!"

"రామూ, నీసంగతి ఎవరికీ బయటపెట్టకూడదని గంటయ్యా నాచేత ప్రమాణం చేయించుకొన్నాడు. నేను ప్రమాణం గనక చేసిఉండకపోతే నిన్ను ఆనాడే చంపివేసి ఉండేవాడు. ఈ రహస్యం ఎన్నాళ్ళు దాచమంటావని వాణ్ణి అడిగాను. తాను చచ్చేదాకా అని వాడు చెప్పాడు, నవ్వుతూ. నేను ముసలిదాన్ననీ, వాడు చచ్చేపోయేందుకు చాలాముందే నేను బుడుంగుమంటాననీ, కాబట్టి ఆ రహస్యం ఎన్నటికీ బయటపడనే పడదనీ వాడి నమ్మకం. కాని, విధివిలాసం! దానిని వాడు ఊహించలేకపోయాడు. వట్టి బంకమట్టి తలవెధవ! నాకంటే ముందే వాడు చచ్చిపోయాడు. ఇంక నేను అసలువిషయం చెప్పివేయవచ్చు," అంటూ ముసలమ్మ రాముని జీవితవిశేషాలు ఇలా వివరించింది.

—ఆ రేండ్లకుముందర ఒకరాత్రి, అర్ధరాత్రి దాటింది. అదాటుగా ఒక శబ్దం విని ముసలమ్మ దిగ్గున కళ్లు తెరిచి లేచింది. అది ఆ ఇంట్లో అదివరకెప్పుడూ విననిశబ్దం! పసిబిడ్డ ఏడుపుశబ్దం!

ముసలమ్మ గబగబ బయటికిపోయి చూచింది. వరండాలో ఒక పసిపాప కాళ్లూ చేతులు తన్నుకొంటూ ఏడుస్తూ పడి ఉంది. ఆ పాపపక్కనే కాళప్పా, గంటయ్యా నిలుచుకొని మెల్లిగా ఏదో మాట్లాడుకొంటూ నిలుచున్నారు. తలుపు చాటుగుండా ముసలమ్మ ఆ మాటలన్నీ విన్నది.

"ఒరేగంటయ్యా, ఈ వెధవాయిని గుట్టుచప్పుడుకాకుండా చంపి పారేయాలి తెలుసా? ఏమైనాసరే వీడు జీవాలతో ఉండగూడదు." అని కాళప్ప ఒకే ఆత్రంలో చెబుతున్నాడు.

"చంపివేయమంటూరు, అంతేగా! మీరు చెప్పిందానికి నేనేం వెనకదీస్తాననుకొంటున్నారా! నిమిషాలమీద ఆ పనిముగిస్తాను, చూచుకోం" డన్నాడు గంటయ్య.

"ఇప్పుడప్పుడే వద్దు. నేను వెళ్లిపోయింతర్వాత ఆపని చెయ్యవచ్చు. ఇంతకూ, ఒరేగంటయ్యా, ఈ పిల్లవాడు ఎవరి పిల్లవాడో తెలుసా? సర్కసుయజమాని గోవిందరావు కొడుకు. వాడికి వీడొకడే కొడుకు. వీడు చస్తే, ఆ సర్కస్సుమాత్రమే కాదు; గోవిందరావు ఆస్తిపాస్తులన్నీకూడ నాకు వచ్చివేస్తాయి. వీడు గనక బతికిఉంటే అవి నాకు దక్కేది కల్ల. వాటికి వారసులేకుండా చెయ్యాలి. ఇదిగో నేను వెళ్ళుతున్నానుగాని నీపని త్వరగా ముగించివెయ్యి," అని కాళప్ప ఆ కటికచీకట్లో ఎక్కడికో వెళ్ళిపోయాడు.

గంటయ్య గదిలోకి వచ్చాడు—కత్తి తీసుకొనేందుకు!

ముసలమ్మ వరాండాలోకి వెళ్ళింది. వంగి ఆ బిడ్డకేసి పరకాయించి చూచింది. బిడ్డ ముద్దులొలుకుతున్నాడు. అందం చిందిపోతున్నది. పాపం! గుక్కపట్టి ఏడుస్తున్నాడు. ఆకలికాబోలు! ముసలమ్మ అది గ్రహించింది. ఇంక కాసేపట్లో చచ్చే సంగతి వాడికేం తెలుసు? ముసలమ్మ హృదయం కరిగిపోయింది. వెంటనే బిడ్డను చేతికి తీసుకొని ఆడించడం మొదలెట్టింది.

గంటయ్య కత్తి తీసుకొని తిరిగి వచ్చాడు. ఎదుటి దృశ్యం చూచి దిగ్భ్రమచెందాడు. "ముసలమ్మా, ఆ బిడ్డ నక్కడ పలక్కుండా వెళ్లిపడుకో, బిడ్డసంగతి నేను చూచుకొంటాను," గబగబా పిల్లవాణ్ణి ఆవిడ చేతులనుంచి లాక్కొన్నాడు.

"గంటయ్యా, నన్ను కావలిస్తే చంపు. కాని, ఈ బిడ్డని మాత్రం చంపకు. వీణ్ణి నేను చంపనివ్వనుగాక చంపనివ్వను," అని ఆ బిడ్డని గంటయ్యచేతుల్లోనుంచి బలవంతంగా తీసుకొంది. తీసుకొని

లోపలికి పోదామని తిరిగింది. గంటయ్య కత్తిపుచ్చుకొని ఆవిడకు అడ్డంపోయాడు.

అంతకువస్తే ముసలమ్మను ఫైసలుచేయడానికిగూడ వెను దీసేరకంకాదు గంటయ్య. కాని, అందుకు కొన్ని చిక్కులున్నాయి. ఆ స్థలమూ, ఆ ఇల్లూ ముసలమ్మవి. ఆవిడకు దూరపుచుట్టాలున్నారు. ఆవిడ తర్వాత ఆవిడ ఆస్తులు వాళ్లకు పోతాయి. కాని, అలా పోనివ్వగూడదు. తానే దక్కించుకోవాలి. అందుకు మార్గాలు చూస్తున్నాడు గంటయ్య. అదేదో దారికేనరకూ ముసలమ్మ బతికి ఉండవలసిందే. తప్పదు. గంటయ్య ఊహాలు ముసలమ్మకు తెలుసు.

"అవ్వా, నీకు సంబంధంలేని విషయాల్లో నీవు జోక్యం చేసుకోవద్దు. ఈ కుజ్జవాణ్ణి చంపకతీరదు. నేను చంపితీరతాను," అన్నాడు.

ముసలమ్మ ఇక అడ్డుపడి లాభంలేదు. చివరకొక తీర్మానానికి వచ్చింది. "గంటయ్యా, ఈ ఇల్లూ, వాకిలీ నీకు ఇచ్చివేస్తాను. అయితే ఒక షరతు. ఈ పిల్లవాణ్ణి నీవు చంపగూడదు. వీణ్ణి నాకు అప్పగించాలి. ఏం సమ్మతమా?" అంది.

గంటయ్య సరేనన్నాడు. తనకూ అని సొంత ఆస్తి కొంత ఉండాలని చాలా ఉబలాటపడుతున్నాడు వాడు. ఇప్పుడు అది భిస్తున్నది. ఒప్పుకోవడంకన్నా గత్యంతరంలేదు, వాడికి.

అయితే, ఇంకొక చిక్కు. ఈ పిల్లవాడు బతికిఉన్నసంగతి ాళప్పకు తెలీగూడదే! దానికేం దారి? గంటయ్య మిణకరిస్తున్నాడు. ముసలమ్మ ధైర్యం చెప్పింది, "ఆ విషయమై నీవేం దిగులుపడవద్దు. ుదంతా నేను చూసుకొంటానన్నది."

కాళప్ప తరుచు వస్తూ ఉంటాడు. అప్పుడు ముసలమ్మ వేస్తుంది తెలుసా? ఆ సమీపంలోనే ఒక గుడి ఉంది. ఆ ,క పెద్ద చెట్టు ఉంది. దానికొక పెద్ద తొర్ర. ముసల ాణ్ణి తీసుకెళ్ళి ఆ తొర్రలో దాచిపెట్టి ఉంచేది. శ

కుండా గప్‌చిప్‌గా పడుకొని ఉండడం పిల్లవాడికి బాగా అలవాటు చేసింది ముసలమ్మ. కాళప్పకు ఈ తతంగమంతా ఏం తెలీదు. గంటయ్య పిల్లవాణ్ణి ఎన్నడో చంపివేశాడనే నమ్మకంలోనే ఉన్నాడు. ఏదేదో నచ్చజెప్పి గంటయ్య కాళప్పకు అలాంటి గట్టి నమ్మకం కలిగించాడాయె మరి!

అలా నాలుగేళ్ళు గడిచాయి. ఇంకెన్నాళ్ళని రాముణ్ణి దాచిపెట్టి ఉంచగలరు? కాబట్టి గంటయ్య ఒక కథ కల్పించాడు. అదికూడ ముసలమ్మ తంత్రమే.

ఒకనాడు కాళప్ప రాముణ్ణి చూశాడు. "ఒరే గంటయ్యా, ఎవడురా ఈ గుంటడు?" అని అడిగాడు.

"గొడ్లు మేపడానికి కుఱ్ఱవాడు లేక చాలా కష్టపడుతూ వచ్చాను. అకస్మాత్తుగా, నిన్న ఎవరో దేశదిమ్మర్లముఠా వచ్చింది. వాళ్ళదగ్గర వీణ్ణి డబ్బిచ్చికొన్నాను," అని గంటయ్య ముందుగానే ముసలమ్మ నేర్పిన చిలకపలుకులు పలికాడు.

"నిన్ను చిన్నప్పుడు దేశదిమ్మర్లవద్ద డబ్బిచ్చికొన్నా"నని గంటయ్య రాముడితో చెపుతూ వచ్చాడు. రాముడుకూడ ఆ మాటలు నమ్మాడు. ముసలమ్మగూడ కాదనలేదు. సమయం వచ్చి నప్పుడు సంగతి బయటపెడదాం లెమ్మని ఇన్నాళ్ళూ ఊరుకుంది.

"ఇప్పుడు సమయం వచ్చింది. రాముడూ, నీవు గోవిందరావ్ మాస్టారుగారి కొడుకువోయ్," అని ముసలమ్మ మూడుమాటలతో కథ ముగించింది.

సింగన్నా, అతని సహచరులూ అలనాటి రాత్రి సంగ రణకు తెచ్చుకొని చూచుకొన్నారు. సింగన్నకు మత్తుమంద న చూపించి నవ్వుల బంగరుపాపను ఎత్తుకుపోయింది ఎవరు రున్నారు? కాళప్ప! సందేహంలేదు!

గిందేదో జరిగింది. పోనీ. పాపం చేసినవారందరూ ఆ — అనుభవించారు. కాళప్ప ఖైదులో పడిపోయాడు

గంటయ్య తుపాకి దెబ్బకు గురియై చచ్చిపోయాడు. సత్యాన్ని నమ్మి "దేవుడు లేడూ, సత్యం జయించదూ?" అని జపిస్తూ కూర్చున్న మృగాలు కూలిపోయిన కంపెనీని మళ్లీ లేవదీశాయి. ఇప్పుడిదిగో ఆ కనబడకుండాపోయిన బంగరుపాపకూడ వారికి దొరికిపోయింది.

కంపెనీకి నాథుడు లేడు. అనొక్కటే కొరతగా ఉండి ది. ఇప్పుడు అదీ తీరిపోయింది. ఎవరూ ఎవరి అభిప్రాయమూ అడగ లేదు. అందరూ అనుకొన్నదొక్కటే. ఇంకెందుకు అభిప్రాయాలు అడగాలి?

రాముణ్ణే యజమానుణ్ణిగా చేయాలి. అది తమ విధికదూ! కంపెనికి ఒక మంచిపేరు పెట్టాలి—ప్రపంచపర్యటనకు బయలు దేరబోతున్నదికూడాను. ఒక పేరు లేకపోతే ఎలా? పేరునుగురించికూడ ఎవరూ పోరుకు దిగలేదు. అందరికీ తట్టింది ఒకటేపేరు. 'గోవిందరావు జంతువుల సర్కస్సుకంపెనీ.'

సాధన యథావిధిగా సాగిపోతున్నది. మేఘాలు గుంపులు గుంపులుగా పరుగెడుతూనే ఉన్నాయి. మధ్య మధ్య సూర్యుడు కనబడుతున్నాడు.

"అనుకొన్ననాడు అనుకొన్నట్లు తప్పక బయలుదేరాలి. ఆనాడు ఓడ కొచ్చిన్ రేవుకు వచ్చి చేరుతుంది. మేము మీకోసం కాచుకొని ఉంటాం," అని అమెరికాదొరల తంతికూడ వచ్చింది. మృగాల ఉత్సాహం చెప్పతరంకాదు.

ఇంక కొన్నాళ్లే ఉన్నాయి. అవి గడిచే దెంతసేపు! ఆ తర్వాత? మూడేండ్లు ఏకధాటిగా ప్రపంచపర్యటన! ఎంత ఆనందంగా ఉంటుంది! బలేజోర్, బలేజోర్!

తిమ్మన్నకు మనస్సులో ఏదో విచారం. దానికి కారణం చిన్నతిమ్మన్నకు తెలుసు. "అన్నయ్యా, ఆ వెధవ జంబూనుగురించి నీకెందు కంత విచారం? వాడు పరమదుష్టుడు! మహాద్రోహి! మన శత్రువుతో చేరుకొని మనల్నే నాశనంచెయ్యాలని ఎత్తులువేసిన నయవంచకుడు! చావనీ ద్రోహి!" అన్నాడు తమ్ముడు.

"తమ్ముడూ, అలా అనకు. జంబూ మనకు ద్రోహం చేసిన మాట వాస్తవమే అనుకో. కాని, మనం అదంతా మరచిపోవాలి. వాడుకూడ మనవలెనే గోవిందరావు మాస్టారుగారి శిష్యుడేకాడా! మనలో ఒకడుగా వాడూ చాలానాళ్ళు కలిసిమెలిసి తిరిగినవాడే కదూ! మనం వాణ్ణి చెయి విడిచిపెట్టకూడదుసుమా!" అని అన్నయ్య అన్నాడు.

చిన్నతిమ్మన్న దాన్ని ఆక్షేపించాడు. కాని, తిమ్మన్న ఆ ఆక్షేపణను లక్ష్యపెట్టలేదు. ఎలాగైనాసరే జంబూ చహారా తెలుసుకొని, వాడి తప్పులన్నీ నేను మన్నించానని చెప్పి వెంటనే వాణ్ణి వెంటబెట్టుకు రావలసిందిగా తిమ్మన రామూ పావురాన్ని ఇదివరకే పంపించాడు.

నాలుగైదురోజులు గడిచాయి. పావురం తిరిగి వచ్చిందిగాని జంబూ రాలేదు. అయితే పావురం వాడి చహారామాత్రం తెలుసుకొనేవచ్చింది.

"నేను చాలాచోట్లు చుట్టి చుట్టి చివరకు జంబూ ఉనికి కనిపెట్టాను. అతగాడు ఒక పచ్చికనేలలో మరణశయ్యమీద పడుకొనిఉండినాడు. నేను దగ్గరపోయి కూర్చున్నాను. నేను వాడికి సంగతంతా చెప్పాను. వాడు నోరు విప్పి బదులు చెప్పబోయాడు గాని నోటివెంట మాటలు పెగల్లేదు. అంత నీరసించిపోయాడు.

నిషిలో ఎముకలూ, తోలూ మాత్రమే మిగిలాయి. ఒంటిమీద
ంచ్చంతా నున్నగా రాలిపోయింది. ఊళ్ళూ అడవులూ మధ్య
కాలుగాలిన పిల్లిలా తిరుగుతున్నాడట. ఊళ్లల్లోకి పోవడానికీభయం,
అడవుల్లోకి పోవడానికీభయం! తిండికి దారిలేదు. మృత్యువుకి
ఎదురుచూస్తూ ముదురుకొని పడుకున్నాడు. చాలా జాలిగా నన్ను
చూచాడు. జారలేక జారలేక వాడికళ్లనుండి రెండుబొట్లు నీళ్ళు
కారాయి. తటాలున ఒక పెద్ద నిట్టూర్పు. వెంటనే వెక్కిళ్ళు.
దాంతో వాడి జీవితానికి ఆశ్వాసాంతం!''

పావురం చెప్పిన ఈ దారుణవార్త విని తిమ్మన్న చాలా
దుఃఖపడ్డాడు. చాలాసేపు అలా ఆరుబయలు చూస్తూనే కూర్చుండి
పోయాడు. ''జంబూ, జంబూ!'' ఆ మాటల్లో స్నేహమూ, అను
ాపమూ తద్రూపంగా ప్రతిఫలించాయి.

''అవ్వా, మీరుకూడ మాతో రావాలి. మన మందరం
ిసి ప్రపంచం చుట్టివద్దాం,'' అని రాముడు ముసలమ్మను పిలి
ాడు. మృగాలన్నీ వాడికోరికను బలపరిచాయి. తామూ అలాగే
ేడుకొన్నాయి.

''నాయనలారా! నేను ఇన్నాళ్లూ ఇక్కడే బతికాను. మిగిలిన
ూన్నాళ్లూకూడా ఇక్కడే బతుకుతాను. నేను ఎక్కడికీ రాను.
ానాయనలు మీరందరూ చల్లగా వెళ్ళిరండి. నాకంతే చాలు.
.. మీకు చెబుతున్నాను. నా ఆస్తి అంతా
... విని

టుంది. మనసుమాత్రం సదా మీ వెంటనే ఉంటుంది,'' అని ము
లమ్మ వారికి చెప్పింది.

''నేనుకూడా రాను. నేను అవ్వతోపాటు ఇక్కడే ఉండి పోతాను. రమ్మని నన్ను ఎవ్వరూ బలవంత పెట్టవద్దు. బలవంత పెట్టి లాభం ఉండదు. నా నిశ్చయం మారదు. నేనుకూడా మీకోసం ఎదురుచూస్తూ ఉంటాను. నేను చెబుతున్నదికూడ జ్ఞాపకం పెట్టుకోండి. నాశరీరంమాత్రమే ఇక్కడ. మనసో? మీ వెంటే!'' అని సింగన్న చెప్పాడు.

అందరూ ఆశ్చర్యపడ్డారు. సింగన్న ఇలా తీర్మానించుకొంటాడని ఎవ్వరూ అనుకోలేదు. దీనికి కారణమేమిటి? తిమ్మన్న చెప్పిందే నిజం. అందరూ పోతే, ముసలమ్మ ఒంటరిగా ఉండాలి. అదికూడదు. ప్రపంచమంతా చుట్టిచూచిరావడం గొప్పవిషయమే ఇటువంటి అవకాశం వదులుకోరానిదే. కాని, అంతకన్నా ము విషయం విధినిర్వహణ. సింగన్న కావలికాస్తున్న సమయంలో బంగరుపాప తప్పిపోయింది. తాను ఆనాడు చేసిన పొరపాటుకి తగి దండన అనుభవించాలని అతడనుకొంటూ వచ్చాడు. బంగారువం ఈ అవకాశాన్ని జారవిడుచుకొని ప్రపంచపర్యటనలో కలవ



వడమే ఇందుకు తగిన దండన అనుకొన్నాడు. తనకుతానే ఈ శిక్ష విధించుకొన్నాడు. ఎంతటి మహానుభావుడు సింగన్న!

ప్రయాణదినం వచ్చేసింది. ఏర్పాట్లన్నీ ముందుగానే చేసిపెట్టి ఉంచారు. ఇక, బయలుదేరడమే తరవాయి.

ప్రయాణసమయంలో ఎవరూ మాట్లాడుకోలేదు. ఎలా మాట్లాడేది! అందరికీ మనసు మనసులో లేదు. ఎంతో విచారపడుతున్నారు. దేశం విడిచిపోతున్నాం. అవ్వను విడిచిపెట్టిపోతున్నాం. దినాలూ వారాలపాటుకాదు—మూడేళ్లపాటు!

అందరూ ఒక్కొక్కరుగా అవ్వకాళ్లమీదపడి దండం పెట్టారు. ఒక్కొక్కరినీ అవ్వ మనఃపూర్వకంగా ఆశీర్వాదంచేసింది. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు. ఎవ్వరికీ నోళ్ళు పెగల్లేదు. మనసులు మనసులుమాత్రమే మాట్లాడుకొన్నాయి. అందరికళ్లనిండా నీళ్లు నిండాయి. పొంగి పొర్లాయి.

చివరకు రామునివంతు వచ్చింది. ''అవ్వా! నా అవ్వా!'' అంటూ గబుక్కున గట్టిగా ఏడ్చాడు. ఆ ఏడ్పు చూచి అవ్వకూడ ఏడ్చింది. రాముణ్ణి గట్టిగా కావిలించుకొంది. ఒళ్లంతా నిమిరి బుజ్జగించింది. ''నా ముద్దులనాయనా, రామూ, చల్లగా పోయి చల్లగా రా. ఆంజనేయస్వామి మీ అందరికీ అండగా ఉండి అనుగ్రహించుగాక!'' అని ఆ వృద్ధ ఆశీర్వదించింది.



రామూ లేచాడు.

నడిచాడు. అతని

బయలుదేరాయి

సాగుతున

తిరిగి తిరిగి చూస్తున్నాయి. కన్నీటి తెరగుండా మసకమసకగా
రెండు ఆకారాలు వారికి కనిపించాయి. అవ్వా, సింగన్నా
గడపదగ్గర నిలబడి రెప్పవాల్చకుండా చూస్తున్నారు. అ
సింగన్నా ఆప్యాయంగా చెప్పిన మాటలు వారి చెవుల్లో రింగు
ప్రతిధ్వనిస్తూనే ఉన్నాయి.

"శరీరమే ఇక్కడ. మనస్సంతా మీతోనే!"

**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA120B149 |
| పుస్తకం పేరు | వింత సర్కస్ |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 137 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | 17016 |
| తయారు చేసినది | nazma |
| పేజీలు విడదీసినది | nazma |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | KASIMBI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | no |
| పరిస్థితి | good |